ఓం

సద్గురవేనమ:

శ్రీమత్ శివరామదీక్షితాచల గురుపీఠాధిపతి

శ్రీమత్ నిర్మలానంద పిల్లలమఱ్ఱి భీమయార్యుల వారి

# మండలారాధనా మహోత్సవాలు



# నిర్మలానంద స్మృత్యర్థ సంచిక

శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య అనుబంధ పీఠం

నిర్మలానందాశ్రమం గ్రా॥ పెద్దాపురం, మం॥ ఆత్మకూర్ జి॥వరంగల్.



శ్రీమతి& శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు-ఉత్తరాంబ గార్లు



నిర్మలానందాశ్రమం గ్రా॥ పెద్దాపురం, మం॥ ఆత్మకూర్ జి॥వరంగల్.

ముద్రణ : కేశవ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ గిర్మాజిపేట,వరంగల్.



శ్రీమతి ఉత్తరాంబ సమేత శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల వారి కుటుంబము



శ్రీనిర్మలానందాశ్రమం పెద్దాపురం లో అచల గురుపూజ తత్వగానామృత గ్రంథ ఆవిష్కరణ
తేది20-05-2008



ఫిబ్రవరి 23-02-2005 పులుకుర్తి లో



నిర్మలానందాశ్రమం పెద్దాపురం లో



నిర్మలానందాశ్రమం పెద్దాపురం



కోలార్ మహాసభలు బెంగుళూరు లో నృత్యం



కోలార్ మహాసభలు బెంగుళూరు లో రజిత కిరీట ధారణ



శ్రీ పరిపూర్ణానంద ఓరుగంటి బుచ్చిరాములు-రంగమ్మ
తొర్రురూ



శ్రీ భూమానంద బూర్గుల బాబురావు-నిర్మల
నందిగామ



శ్రీ సమరసానంద పోరెడ్డి రమణారెడ్డి-అమృత
రేగొండ



శ్రీ నిష్కల్మశానంద పోతరాజు చంద్రయ్య-అంజమ్మ
గోదావరిఖని



శ్రీ శాంతానంద ఓల్వోజు సదానందచారి-నళిణి
మహాముత్తారం



శ్రీ నిర్బయానంద మాడెం రాజబాబు-మంజుల
మహాముత్తారం



శ్రీ సత్యానందాతీత కూనమల్ల సదానందం-సుశీల
పెద్దాపురం అశ్రమవాసులు



శ్రీ బక్తానంద వరిపెల్లి రంగమ్మ-నాగయ్య
హన్మకొండ



శ్రీ సదానంద యెడ సారంగపాణి - లక్ష్మి
మహ్మదాపురం



శ్రీ సత్యానంద ముద్రబోయిన స్వామి-సరోజన
మహ్మదాపురం



శ్రీ భోదానంద దాసి వనమాల-సాంబయ్య
నర్సాపురం



శ్రీ నిజానంద వజీరు మలహాల్ రావు-సుగుణ
పరకాల



శ్రీ వివేకానంద మాడెం లచ్చన్న-వెంకటమ్మ
మహాముత్తారం



శ్రీ సత్యానంద గూడెల్లి నర్సయ్య - మల్లమ్మ
హన్మకొండ



శ్రీ నిజానంద గూడెల్లి ఉప్పలయ్య-అనసూయ
హన్మకొండ



శ్రీ అ.ప గుమ్మడవెల్లి సోమయ్య-లక్ష్మి
మల్లంపెల్లి



శ్రీ అ.ప. కొండూరి దశరథం దంపతులు
కాజీపేట



శ్రీ అ.ప. కక్కెర్ల చంద్రమౌళి-బతుకమ్మ
పెద్దాపురం



శ్రీ అ.ప. తీగల మహబూబ్ రెడ్డి దంపతులు
అమ్మాపురం



శ్రీ అ.ప పూజారి సమ్మక్క
శివనగర్, వరంగల్.



శ్రీ అ.ప. కొలిప్యాక విజయనిర్మల-యాదగిరి
హన్మకొండ



శ్రీ అ.ప. తిప్పని రాజమౌళి-కనకలక్ష్మి
గోదావరిఖని



శ్రీ అ.ప. గోపిరెడ్డి రవిందర్-విజయ
గోదావరిఖని



శ్రీ అ.ప.అప్పని బాలకృష్ణ-లక్ష్మి
గోదావరిఖని



శ్రీ అ.ప. బండి రాజయ్య-మల్లమ్మ
రంగయ్యపల్లె



శ్రీ అ.ప. గూడెల్లి మునికుమార్-పద్మావతి
హన్మకొండ



శ్రీ అ.ప.కూనమల్ల వెంకటనర్సు-వెంకటమ్మ
పెద్దాపురం



శ్రీ కృపానంద కోడెం లక్ష్మీనారయణ దంపతులు
సిరిసిల్ల



శ్రీ బోధానంద బొడ్డు అంబరీష-వీరలక్ష్మి
బీమండి



శ్రీ పూర్ణానంద బొడ్డు సత్యనారయణ-సత్యవతి
కాకినాడ



శ్రీ అ.ప.సంపతి రజిత- ప్రభాకర్‌రావు
హన్మకొండ



శ్రీ అ.ప.కట్ల సంజీవరెడ్డి-కోమల
రేగొండ



శ్రీ అ.ప. గన్‌రెడ్డి రవిందర్ రెడ్డి-స్వరూప
రేగొండ



శ్రీ అ.ప.పెరుగు లింగమూర్తి-శ్రీలత
నారయణపూర్ క్రాస్ SS నగర్



శ్రీ అ.ప.పాలకుర్తి శ్రీనివాస్ గౌడ్-శ్రీలత
కోగిలవాయి



శ్రీ అ.ప.గడబోయిన రమేష్ -హైమ
కోగిలవాయి



శ్రీ అ.ప. గ్యారంపల్లి లలిత-శివరావు
పరకాల



శ్రీ అ.ప. కంకటి కళ్యాణి-రవి
నందిగామ



శ్రీ అ.ప.మోరె రాజేశ్వర్ రావు-యాద
నందిగామ



శ్రీ అ.ప.మాసంపల్లి శంకర్‌రావు-దేవేంద్ర
రేలకుంట



శ్రీమతి& శ్రీ మామిడి స్వాతి - రాజు
వరంగల్



శ్రీమతి& శ్రీ మారదోజు వినోద-సదానందం
వరంగల్



శ్రీమతి& శ్రీ కన్నం రమాదేవి-రాజన్న
వరంగల్



శ్రీనిర్మలానంద గర్రె రామమూర్తి-వెంకటలక్ష్మి
నకిరేకల్



శ్రీమతి& శ్రీ  పోలం సరోజన-మాధవరెడ్డి గారు
ఆశ్రమ స్థల ధాత పెద్దాపురం



శ్రీమతి రాయరాకుల యాదమ్మ గారు
సర్పంచ్ పెద్దాపురం

శ్రీమతి & శ్రీ రాయరాకుల విజయ-రవిందర్
పెద్దాపురం



శ్రీమతి& శ్రీపూర్ణానంద కూరెల్లి విఠల్ రెడ్డి దంపతులు
నాచారం హైద్రాబాద్



శ్రీ.అ.ప.కూనమల్ల రాజేంద్రప్రసాద్
పెద్దాపురం

సంపతి అభినయ్ ,సాత్విక్
హన్మకొండ



శ్రీమతి& శ్రీ దయానంద బాల్నాకు పరమేశ్వర్-శారద
గౌలిగూడ హైద్రాబాద్



శ్రీమతి& శ్రీ శాశ్వితానంద సాష్లేటి ఉప్పలయ్య-బొందమాంబ
ముంబాయి



శ్రీ నిర్మలానంద గండెపల్లి రమణమూర్తి గారు శ్రీ దయానంద సరస్వతిస్వాముల వారు



శ్రీమతి& శ్రీ పోటునూరి శశిరేఖ-శేకరయ్య
గొల్లెకుంట

ఓం సద్గురవే నమః ఓం

శ్రీమత్ శివరామ దీక్షితాచల గురుపీఠాధిపతి

అచలతత్వ గాన, నృత్య కళాకోవిదులు

శ్రీమత్ నిర్మలానంద పిల్లల మర్రి భీమయార్యుల వారి

## మండలారాధనా మహోత్సవాలు

తేది : 24-09-2013 మంగళవారం

# నిర్మలానంద స్మృత్యర్థ సంచిక

సంపాదకులు :

శ్రీమత్ భూమానంద నల్లఉపేంద్రార్యులు

శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య రాష్ట్ర ఉపాధ్యక్షులు

# నిర్మలానంద స్మృత్యర్థ సంచిక


- ప్రచురణ : నిర్మలానంద ఆశ్రమము, పెద్దాపురం.
- సందర్భము : నిర్మలానంద భీమయార్యుల వారి మండలారాధన
- సంవత్సరం : 24-09-2013
- ప్రతులు : 1000
- డి.టి.పి. : వేణుగోపాల్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, మార్కండేయ వీధి, వరంగల్.
  పుట్ట భరత్ కుమార్, సెల్ : 9391717310
- అడ్రస్ : నిర్మలానంద ఆశ్రమం
  పెద్దాపురం. సెల్ : 9951231943

# సంపాదకీయం

యుగానికొక్కరు జగానికొక్కరు అను చందంగా వరంగల్లులో ఈ యుగానికి యుగపురుషుడు భీమయ్యగారు.

వరంగల్లులో అచలబోధ ప్రచారము క్రమానుగతంగా వందేండ్లుగా వర్థిల్లుతూ వస్తున్నది. సచ్చిదానంద అవధూత మొదలు శ్రీ మందిప్పల హనుమంత రాజయోగి, వారి శిష్యుడు శ్రీ పొన్నాల రాజమోగీంద్రుల వారు. భుక్తి ముక్తి క్రియలను ఇక్కడే నిర్వహిస్తూ ఎన్నో సంవత్సరాలు బోధ ప్రచారం సాగించినారు.

శ్రీ వాడపల్లి ఆగదాసు గారు వీరందరితో సత్సంబంధాలు కల్గి ఉన్నారు. గ్రంధాలు వ్రాసారు గ్రామాలు తిరిగారు. బోధ ప్రచారం చేశారు. నాటి తెలంగాణ పదహారు జిల్లాలల్లో ఆగదాసుగారికి శిష్య ప్రశిష్యులుగా వేలాది మంది ఉన్నారు. ఇంకా గురువులు శ్రీ నాగుల రాజకనకయ్య శ్రీ గోపు గోవిందు , అడ్డగట్ల రాఘవయ్య, మడిపల్లి రాఘవయ్య, అడిగొప్పుల నారాయణ మొ॥ వారు గల్లిగల్లీకి ఈ బోధను వెదజల్లినారు.

అనేకమంది గురువులచే ప్రభావితమైన ఈ వరంగల్లులో మరో కలికితురాయి భక్తానంద తూడి దేవమాంబ గారు. ఆగదాసు సేవలో తరించిన ఆతల్లికి ముగ్గురు శిష్యురాండ్లు. బలభద్ర పరమేశ్వరమ్మ, గౌరమ్మ, లింగమ్మ గారలు. ఆశ్రమ నిర్మాణం చేసి అందులో పూజలు సేవలు, ప్రారంభించినారు. దేవమాంబ గారు ఆగదాసు శిష్యులైన వాళ్ళను మేల్కొల్పడం, తన శిష్యులకు బోధచేయడం జరుగుతున్న ఆ క్రమంలో ప్రస్తుత కథానాయకుడు, గురుసేవ చేసి, గురుకరుణకు పాత్రుడైన భీమయ్యగారు, ప్రవేశించినారు. ప్రస్తుతం భీమయార్యుల వారి మండలరాధనలు ఘనంగా చేస్తున్నవారి శిష్యప్రశిష్యులు ఒక స్మృత్యర్థ సంచికను ముద్రించాలను కున్నారు. వ్యవధి తక్కువ వంద పేజీలు అనుకున్న దాన్ని కుదించినాము. భీమయార్యుల వారితో అనుబంధమున్నవాళ్ళు, తమతమ అనుభవాలు జ్ఞాపకాల మధుర స్మృతులను పంపినారు. ఎంతో అద్భుతంగా ఉన్నాయి. వాస్తవాలున్నాయి. భీమయ్యాగారి జీవితం తెరచిన పుస్తకం. ఆ పుస్తకాన్ని వ్యాసకర్తలు ఆవిష్కరించారు. వారికి మరియు అన్ని రకాల సహకరించిన సాంప్రదాయకులకు కార్యకర్తలకు, ద్వాదశాభినందనలు... తెలుపుతూ సంచికను మీముందు ఉంచినాము. ఆదర్శమూర్తి భీమయ్యగారి అంతరంగాన్ని దర్శించండి. మంచి కథానాయకుని గురించి వచ్చిన మంచి సంచిక ఇది. ఆదరించండి.

సంపాదకులు
**– నల్ల ఉపేంద్రార్యులు**

# శ్రీ భీమయ్య గారి బోధామృత ప్రసాదం

## నిర్మలానంద తత్వదర్శిని నుండి

- శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయ్య



శ్రీ శివరామ దీక్షితులవారి అచల సిద్ధాంతము వలన మానవునికి నిశ్చల భావము ప్రధాన మను అంశమునకే యొక్కుడు ప్రధాన్య మివ్వబడినది.
చంచల స్వభావమున యేకార్యము సుసంపన్నము కాదు గనుక యిహపర సుఖ సంపన్నదాయకమునకు ధైర్యస్థయిర్యములు సోపాన పంక్తులు మానవుడు బ్రహ్మా నంద భరిత సౌఖ్యసీమకు చేరవలెనన్న శాంతి తద్వార చలనరహిత విధానము విదిగా అభ్యసింపవలసిన ఆగత్యమెంతైన అవసరము.

ఈ అచల భావమును ఏతత్ప్రత ప్రబోధ కాచార్యులు చక్కని పంథాలో బోధించి సిద్ధాంతరహిత సిద్ధాంతమును స్థాపించిరి. ఉత్తరోత్తరవారి మార్గాను వర్తుండనగు నేను తద్భావమును ఏతత్ గ్రంథమున పాటలు పద్యముల రూపమున కొంత ప్రకటపరచి. తనవితీరని డెందమున గద్యమయ యుగమని పేరు గాంచిన యీ కాలమున కొంత వచనము వ్రాయుట అవసరమని భావించి యీ ప్రయత్నమునకు కడంగితిని

అచలభావము

అచలమను సిద్ధాంత నిర్వచనము మన యీ ప్రాచీన గ్రంధరాజములందు వెదకిన కోకొల్లలు. ప్రస్తుతము ఏతత్ప్రత లక్ష్య లక్షణ సమన్వయమున ఉద్దండుడని పేరుగాంచిన అఖండుడు భాగవత శ్రీ కృష్ణుని కందార్థోక్తంబయిన పర్యాయ అచలనామముల నుదహరించి తదనంతరము తల్లక్షణ సమన్వయనము నకు ప్రయత్నింతుము. “పరమపద మనిన బయలన గురుగుహ్యా మనంత మనిన గోప్యంబనిన్ పరిపూర్ణ మచలమనినను తిరముగా బట్టబయలు దెలియూ మాయప్పా” ఇంకా “ఎరుకా నెరిగినదన్న యెరుకా మీరినదన్నా యెరుకా మరుపుల్లేని పరవస్తు వనబయలె తెలియూ మాయప్పా” అని ఇట్లీ ప్రకారముగా పేర్కొన బడిన అచలము క్రియాశూన్యమని చెప్పుటకు యీ పద్యము లుపకరించును చూడుడు. “సామర్థ్యమేమి జూపదు, కామ క్రోధాధికముల కలయ దనిశమే బాము లెరుంగదు. యితరులు యేమనినను మారు పల్క దీ బట్టబయలూ” దీని స్థితిగతులు చెప్పి చూపుటకు సాధ్యముగాదని మరొక పద్యము శ్రీ కృష్ణోక్తమయిన దానిని తిలకింతము. “పలుకున పలుకగ రాకను తలపోయుద మనిన మదికి తగులక యెపుడన్ ములుగృచ్చ నందు లేకను కలిగున్నదని” బహునీటయిన భావమును సూటిగా చెప్పుటకు దీటైన పదములను వాడి కవి భావస్ఫూర్తిని కల్గించెను. అదే విధముగ అర్థగౌరవమునకు భక్తిమయరస స్ఫోర కమయిన ప్రయత్నమున శ్రీ కృష్ణుడు సిద్ధహస్తుడు. ఈయనకు లోకానుభవము యొక్కుడు. చమత్కార వంతమయిన కవిత చెప్పుటలో బహునేర్పరి చూడండి పైన పేర్కొనబడిన అమలవిజ్ఞానాతీత మయిన భావమును “ఇదిగో చూడు కదులాదోయన్నా” అని పట్టి చూపుచున్నాడా అనునట్లు చెప్పుచున్నాడు. లౌకిక అలౌకిక భోగవాంఛాతీత మయిన అనుభవమును అచ్చ తెనుగున బోధించ ప్రయత్నించిన వారిలో శివరాముని తరువాత భాగవత కృష్ణుడని చెప్పుటలో సంధియ మెంతమాత్రము లేదు. “అపరోక్షమయిన మనుజునకు పరోక్షంబగునె బయలు గురుకృపలేకన్” అని గురుకృపాలబ్ధతకు ప్రాధాన్యమిచ్చి వారికి సేవలు చేసి తత్ కృపకు పాత్రులు కమ్మని అట్టి వారికి యీ అచలభావము కరతలామలక మగునని గురువు లేకుండా విద్య నభ్యసించ ప్రయత్నం చేసేవారలకు హెచ్చరిక చేస్తున్నాడు. ఈ క్రింద చూడండి. “గురు మూర్తి చూపకున్నను పరిపూర్ణంబెట్లు తనకు ప్రత్యక్షంబగున్” అచలభావానురక్తతకు తత్‌సిద్ధి వడయుటకు భావశబలత పనికిరాదని నిశ్చలత అనుసంమని తన కావ్య సంపుటిలో యెన్నో మార్లు నొక్కి వక్కాణించినాడు. అనుభవాతీతమయిన అచలం. “పలుకన్నా పలుకాక తలపన్నాదెరుగాక చలి యెండా వానాల నలయాక నిలుచుండూగదరా మాయన్నా” అని యిట్లెన్నియో విధముల రకరకాల ఉపమాన

ఉపమేయములద్వార సెలవిచ్చియున్నారు. తన గ్రంథమున ఒక్కొక్కసారి భావపునరుక్తము యేర్పడి చర్విత చర్వణమై రసాభాస మగుచున్నదను విమర్శకు జవాబుగా తన విజ్ఞాపనలో ఇట్లు పేర్కొన్నాడు. కొంచాపు నది లోతంచూ యెంచీ విస్తీర్ణ పరచినచో దాని గాంభీర్యమునకు జంక వనిలేకుండ ఉండుటకయి తానీగ్రంథమును పెంచితినన్నాడు. "ఇంతింతవి యనరానిది వింతలు చేయునిది యెన్నివిధముల గనిన్ చింతలెరుంగని దీబయలు" అని చెప్పి అచింత్యమయిన భావమునొందుమని ప్రబోధము చేయుచున్నాడు. శివరామదీక్షితులు తన గ్రంథములయందు యెక్కడ చూసిన పరిపూర్ణమేమి గానిదని అది యేమిలేనిదని అది అందరికందనిదని పదే పదే చెప్పుటలోని అంతరార్థము. ప్రతి ఒక్కరు అట్లు కమ్మను మనియే అట్లుగాని నాడు మనకు మిగతా మతముల వారికి తేడాయేమియు యుండదని అట్లుకానినాడు మన ప్రత్యేక అభ్యుదయ వాదమునకు ఫలితమే లేకుండ పోవునని అడుగడుగునా హెచ్చరికలు చేసియున్నారు. పరిపూర్ణమును గూర్చి కృష్ణుడిట్లనుచున్నాడు. "తండోపతండములుగా దండిఝుషాదికములన్ని తనలోపల సుద్ధండత నుండిన పోయిన నిండు సముద్రంబు యెరుగాకుండా నెప్పటికీ పరిపూర్ణామిట్లుండూ". నెప్పటికి అని యిట్లు సర్వసామాన్యుల కందుబాటులో నుండు ఉపమానము లెన్నియో చెప్పి శివరాముల అభిప్రాయమునకు వన్నెలు దిద్ది అచల భావమును దిగ్దిగంతములకు వ్యాపింప చేసినాడు. ఈ అచలభావము సిద్ధించుటకు గురు కృప అవసరమని అట్టి కృప పొందుటకు యెన్నియో మార్గములు కల్గియున్నప్పటికిన సేవాపద్ధతి సర్వశ్రేష్ఠమయి సర్వులకు సులభసాధ్యమయి యున్నందున అట్టి సేవావిధానమునకు ప్రాధాన్యమిచ్చి అచ్చటచ్చట గురు శిష్యుల మధ్యన అన్యోన్యానురాగము పరిపుష్టి చెందుచున్నది. నిర్మలానంద తత్వదర్శిని నుండి కొంతభాగం.

## మన సాంప్రదాయంలో విశిష్టమైన వ్యక్తి భీమయ్య గారు

- శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయులు



అవధూతశాఖలో -వాడపల్లి అగ దాసుగారి శాఖలో ఒక విశిష్టమైన గురువు మాతృశ్రీ భక్తానంద తూడి దేవ మాంబ గారు వారు అనేక ప్రాంతాలగురువులను రావించి తమ శిష్యులచేత సేవలు చేయించి ఆదర్శ ప్రాయంగ వెలసినవారు వారు వారి శిష్యుల్లో చాలామంది సాంప్రదాయమునకు సేవలు చేసినవారున్నారు.

పరమేశ్వరమ్మ, గౌరమ్మ, లింగమ్మలతో పాటు చెన్నస్వామి, భీమయ్య, ఉపేంద్రయ్య, లచ్చన్న పేర్కొన తగినవారెందరో ఉన్నారు. రాజిరెడ్డి ప్రతాపరెడ్డి, వెంకటస్వామి ఇప్పటి ఆశ్రమాధ్యక్షుడు వెంకటరాం నర్సయ్య గారలెందరో అమ్మసేవలో తరించిన వారున్నారు.

అందులో ఒక విశిష్టమైన గురుడు నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు గారు.

భీమయ్యగారు చిరకాల గురుసేవాధురంధురుడు. సమరసభావజ్ఞులు. సాంప్రదాయాభివృద్ధికి విశేషంగా కృషి చేసినవారు. భక్తజన వశీకరుడు. తమ శిష్యులచేత, అనేక ప్రాంతాల ఆశ్రమాల, మహాసభల సందర్భంలో అనేక పూజలు సన్మాన-సత్కారాలు అందుకున్నారు. మన సంప్రదాయములో అనుభవజ్ఞుడైన ఒక మహాను భావున్ని కోల్పోయినాము ఈ లోటు ఎన్నటికీ తీరనిది. వారెప్పుడూ మన హృదయంలోనే ఉంటారు. మన సంప్రదాయములో మనందరం కల్సి విశేష కృషి చేస్తే ఆయనకు నిజమైన నివాళులు అర్పించిన వాళ్ళ మౌతాము, నిర్మలానంద స్మృత్యర్థ సంచికకై ఈ నాలుగు మాటలు మండలారాధన విజయానికి అందరి తోడ్పాటు కోరుతూ....

వివేకానంద బండారు సుబ్బారాయస్వామి
గ్రా॥ & మం॥ ధర్మవరం, జి॥ అనంతపురం.
సెల్ : 9849472103

## శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్య స్మృతి పదాలు

- శ్రీ దయానంద నాగుల వెంకటేశం



శ్రీ మదఖండ సచ్చిదానంద రహిత, అతీత అచల పరిపూర్ణుండును, శ్రీ మద్వేదాంత సా రుండును, బృహద్వాశిష్ట సద్విచార సాదుమార్గ సత్ప్రవర్తనుండును, క్షరాక్షరోపాది ద్వయదోషరహిత విలక్షణుండును, గుహ్యోద్గుహ్య పరమగుహ్య, గురువాక్య, గురుసేవధురంధరుండు, చిలుకలగూడ- శ్రీనిత్యానంద కొండోజు సీతయార్యుల వారి 8వ వార్షికారాధన పూజలో పరిచయమేర్పడి, మధ్యన సుమారు 13 సంవత్సరముల పైననే కలయక తర్వాత శ్రీ గూడూరు చెన్నస్వాముల వారి ద్వారా. అనగా 1999లో అప్పటి నుంచి యిప్పటివరకు వారి ప్రేమ, వారి దయ, వారి కరుణ నాయందు నేటి వరకు ఉన్నవి. దృఢతరమైంది. అట్టి భీమయార్యులవారు వరంగల్ జిల్లాలో గొప్పనైన ఆచారముగల వారు, అనుష్టాన సిద్ధిగలవారు, గనుకనే ప్రతినిత్యము స్నానానుష్టానము, విభూతిధారణ, ఆయనబొట్టు, ఆయన పంచకట్టు, ఆయన ధరించు ఉత్తరీయము, ఆయన జపించే జపమాల సాంప్రదాయకమునకు ఎంతో కనుల పండువుగా చూచినాము. యెంత అనారోగ్య పరిస్థితులలో కూడా ఆయన బొట్టు, కట్టు, అనుష్ఠానము మరచి ఉండేవారు కాదు. అది ఆయనకే సాధ్యము, సామాన్యులకు కాదు. శ్రీ భీమయార్యుల గొప్పదనము శ్రీ బోధానంద గూడూరు చెన్నస్వాముల నోటి నుండి విన్నాను గురుమాతయైన శ్రీ దేవమాంబ గారి వద్దకు శ్రీ చెన్నస్వామి వారిని తీసుకొచ్చి ఉపదేశము చేయించడమంటే యెటువంటి ధీరులైన ఆపని చేయలేరేమో అనిపిస్తొంది. అదేవిధంగా చాలా మందిని తనగురుమాత పాదాల చెంతకు తెచ్చి మంత్రోపదేశము చేయించిన ఘనత వీరిదే, మంచి కవి బోధకులు, భూమానంద నల్లఉపేంద్రయ్యను కూడా వీరే గురుచెంతకు చేర్చారు. మరియు శ్రీ తంగళ్ళపల్లి రాజేందర్‌లాంటి శిష్య రత్నమును తీర్చిదిద్దిన సౌమ్యుడు శ్రీ భీమయ్యార్యులవారు. శ్రీ సద్గుణానంద తగంళ్ళపల్లి రాజేందర్ పదేపదే చెప్పేమాట యేమిటంటే అయ్యా-మా గురువు భీమయార్య ప్రభువులాంటి వారు, శిష్యులకు దొరికేది ఎంతో సుకృతముంటే గాని దొరకరు అని చేప్పేవారు. శిష్యులు గురువుల తప్పులు, గురువుల నడకలు, గురువుల నిందలు జేసే ఈ కాలములో తనను ఆశ్రయించిన శిష్యులు, నా గురుదేవులు ఎంతో గొప్పవారు అని అన్నారంటే శ్రీ భీమయార్యుల వారు ధన్యులు, ధన్యజీవి, ధన్యాత్ములు. శ్రీమదశరీర నిజగురు సార్వభౌమ శ్రీనిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు! వరంగల్లు జిల్లాలో అచల బోధ ఉన్నదంటే అచల సిద్ధాంత ధర్మము బోధింప బడుతుందంటే శ్రీ నిర్మలానంద భీమయార్యుల వారిదే. ఒక చక్కటి యువతరమును సాంప్రదాయ మునకు అందించిన ఆదర్శగురుమూర్తి భీమయార్యగారు. కీర్తి-ఘనమైన యుక్తి జేసినవాడే శిష్యుడు అన్నట్లుగా... తాను యుక్తి జేసి సోదరులను సంపాదించినాడు. తర్వాత గురుమాత యైన శ్రీ దేవమాంబ గారికి అంకితమిచ్చి చక్కటి తత్వములు, మంగళారతులు, కవితాజేసి గ్రంథ మందించిన దివ్యమూర్తి. అదియునుగాక బంగారు లాంటి పతకమునకు రత్నములు, ముత్యములు, వజ్రములు, వైఢ్యూర్యములు, మరకత, మాణిక్యములు అమర్చి తెచ్చి శ్రీ సేవసమాఖ్యకు అప్పజెప్పిన ఆశ్రిత త్యాగమూర్తి, భీమయార్య. చూడండి! ఒక రత్నం-కడిపికొండ బుచ్చివీరన్న, ఒక పగడము-రాజేందర్, ఒక ముత్యము -గీదా మోహన్‌రెడ్డి, ఒక వజ్రము-బండి చక్రపాణి, ఒక వైఢూర్యము-బుచ్చిరాములు, ఒక మరకతము-రమణారెడ్డి, ఒక పచ్చ-బాబురావు, ఒక పుష్పరాగము-రాజబాబు యింకా యెంతో మందిని సమాఖ్యకు అందించిన ఘనత శ్రీ భీమయార్యులదే. శ్రీ భీమయార్యుల వారి గురుత్వము రాణించినట్లు యింక యెవరిది రాణించదు, అది అసాధ్యమయినది. యే గురువును జూచిన, ఏ భక్తుని చూసిన తనగురువు వలెనే భావించేది, అది అందరికి రాదు. 1999లో నన్ను తీసుకొని సుమారు 10,15 రోజులు, వారి శిష్యుల గ్రామములలో ఉంచుతూ యెన్నో గ్రామములు త్రిప్పుతూ వారు చెప్పినట్టు మీరు

వినాలి, ఆచరించాలి, ఆయన మనకెంతో కావలసిన వారు అనిచెప్పి శిష్యులతో అనంత సేవలు జేయించిన ఆత్మీయుడు. వారికి 2005లో కోలారు మహాసభలలో రజిత కిరీట ధారణ చేసినప్పుడు వారి సోదరుడు శ్రీ భూమానంద నల్ల ఉపేంద్రార్యుల వారు ఏకాదశ పద్యరత్నమాల సమర్పించినారు. అదియును గాక తూర్పుగోదావరి జిల్లా, చిన్నబొడ్డు వెంకటాయపాలెంలో శ్రీ నిర్మలానంద బొడ్డు బైరవస్వాముల వారి ఆశ్రమము నందు శ్రీ బొడ్డు కృష్ణమూర్తి, బొడ్డు సత్యనారాయణ సోదరులు 22-4-2013న శ్రీ భీమయార్యుల వారికి సన్మానపత్రము ఉత్తమ గురువుగా ఎంపిక చేసి ఇచ్చినారు. మరియు తేది : 25-05-2013న శిష్యుడు శ్రీ నిష్కలానంద బండి చక్రపాణి దంపతులు వ్రేలికి బంగారు ఉంగరము, ముంజేతి కంకణములు, కాలుకు గండపెండేరము, కర్ణములకు మకర కుండలములు, పట్టు జరిఅంచు దోతులు, పట్టు వస్త్రములు, నిజగురునకు నిజముగా పూజ చేసినారు. యింకాతన శిష్యులు ఎందరో సన్మానములు, సత్కారములు చేసినారు.

ఇది చాల విచిత్రము, ఒక్క గురు శిష్యులు, ఆత్మసోదరులు,యింత అన్యోన్యముగా ఉండడము అంటే సంతోషంగా ఉన్నది. శ్రీ భీమయార్యులవారి శ్రీ నల్ల ఉపేంద్రార్యుల వారి అదృష్టము. వాళ్లది విడదీయరాని అన్నదమ్ముల అనుబంధం యెందుకనగా నేనే కొన్ని వందల మంది గురువులను చూచినాను. అన్నదమ్ముల మధ్య పగలు కుంటే,ఎక్కువగా భేదములు పగలు ఉన్నాయి. ఆయనకు అంతమంది శిష్యుల యినారు. ఆయనను క్రింద పడవేయవలెనని లేనివి కల్పించి, అంతఃకలహాలు బెట్టి పాడుజేసే వాళ్లు ఎక్కువ ఉన్నారు. కాని శ్రీభూమానంద నల్ల ఉపేంద్రయ్యగారు తన సోదరునికి కిరీటము పెట్టుచున్నారంటే అత్యంత "ఆనందముతో అచల సద్బోధగాన నృత్యాల రత్న" అనిమకుటం బెట్టి పద్యాలు రచించినారు. అందులోనుంచి కొన్ని.

1. అతి బాల్య దశలోనె అమ్మ దగ్గర జేరి-అంకిత మయ్యితి రయ్య మీరు
భజనలో అమ్మను భక్తితో కీర్తించి- గ్రంథం మంకిత మిస్తి రయ్య మీరు
అమ్మ పూజలనాడు ఆనంద భరితులై-గాన మాలాపిస్తి రయ్య మీరు
అమ్మ ఊరేగింపు ఆనంద వేళలో-అచల నృత్యము చేస్తి రయ్య మీరు

తే॥ అచల గురువుల నెందర్నొ ఆశ్రమయించి-అచల బోధను అందితి రయ్య మీరు
నిర్మలానంద, భీమార్య, నిజగురుండ-అచల సద్బోధ, గాన, నృత్యాల రత్న

2. ఎనబదేండ్లైతేమి, ఇంకిర్వదైతేమి-నిత్య యౌవనకాంతి, నిజము మీది
ఎంత దూరంబైన, ఎంత ద్రవ్యంబైన-గురుపూజలకు నేగు, కోర్కె మీది
తన శిష్యులని కాదు, తదితరులని కాదు-అందర్ని ప్రేమించు, హక్కు మీది
ఎదిరించు వారలు, ఎంత వారైనను-నీళ్లు మ్రింగించేటి, నేర్పు మీది

తే॥ అందరికి తల నాల్కలా అణగి మెణగి-ఉందు వినయము, మీది ఉద్దండచరిత
నిర్మలానంద, భీమార్య, నిజగురుండ-అచల సద్బోధ, గాన, నృత్యాల రత్న

3. సేవా సమాఖ్యను చేపట్టినది మొదల్-త్రికరణ శుద్ధిగా తిరిగినారు
కేంద్ర ఉపాధ్యక్ష కీర్తి చేకొన్నారు-శిష్యుల తన వలె త్రిప్పినారు
ప్రతిచోట సన్మాన ప్రాభవ మందారు-అమ్మకే అంకితం బన్నవారు
కోలారు సభలలో గురువుల సన్నిధి-బిరుదులు పొందిన పెద్దవారు

తే॥ శ్రీ కిరీటము, కుండలాల్, శ్రీకరముగ-అందిపొందిన సద్గురుం డచల యోగి
నిర్మలానంద, భీమార్య, నిజగురుండ-అచల సద్బోధ, గాన, నృత్యాల రత్న

4. మంచి గురుండని ఎంచగా వలెనంటె-ధనధాన్య సందల్ పనికిరావు
మంచి గురుండని ఎంచగా వలెనంటె-పలుగాకి విద్యలు పనికి రావు
మంచి గురుండని ఎంచగా వలెనంటె-బల పరాక్రమములు పనికి రావు
మంచి గురుండని ఎంచగా వలెనంటె-వాద వివాదముల్ పనికిరావు

తే॥ మంచితనమొక్కటే గొప్ప మంచిచేయు-మంచి భీమార్య మన సంత మంచిదయ్యె
అందుకే మంచి గురువుగా అవని వెలిగె-గాన, నృత్యాల, బోధల ఘనత పెరిగె

5. శివరామ దీక్షితా, సిద్ధాంత బోధను-జగమంత చాటేటి, జాన ఎవరు
తూడిదేవాంబను, వేడి సత్కృతులచే-దేశమెల్లను చాటు, ధీరుడెవరు
శ్రీ మించు అచలాన, శ్రేష్ఠమౌ గురుజండ-నవనిలో త్రిప్పేటి, ఆర్యులెవరు
తన వెంట శిష్యుల, తనవంటి వారుగా-చేసి సమాఖ్యకు చేర్చె నెవరు

తే॥ అట్టి సద్గురు, భీమార్య పట్టుదలను-వేయినోళ్ళతొ-వర్ణిచ వీలుపడెనె ?
అమ్మ దేవాంబ శిష్యుల్ల అంతవారు-కలరె ? గురుసేవ చేసిన ఘనుడతండు

6. శిష్యులు కవులయ్యి, శ్రేష్ఠమౌ గేయాల-నీ కీర్తి జగమంత నిలిపినారు
శిష్యులు గురువులై శిష్యుల గావించి-నీ కీర్తి జగమంత నిలిపినారు
శిష్యులు ప్రతి చోట చేరి, పూజలు చేసి-నీ కీర్తి జగమంత నిలిపినారు
శిష్యులు అటనట చేసుపన్యాసముల్-నీ కీర్తి జగమంత నిలిపినారు

తే॥ ఎన్ని తీరుల నీ కీర్తి ఎదుగుచున్న మీరు మాత్రము, ప్రవిమల, మేరు సములె
నిర్మలానంద, భీమార్య, నిగమ వినుత-అచలు లందర, కాదర్శమైన గురుడ

ఇలాంటి సువిశాల హృదయుడు శ్రీ భీమయార్యుల వారు. యీలాగున వీరి స్మృతి పదాలు వర్ణించ తరముగాదు, అయ్యా ! మీకు నా నిరంతర గురు స్మరణాభి వందనములు చేయుచున్నాను.

**శ్రీ దయానంద నాగుల వెంకటేశం రాజయోగి**
శ్రీమదచలగురుపీఠ రాజయోగాశ్రమ సేవసమాఖ్య కేంద్ర ఉపాధ్యక్షులు
గ్రా॥ గొల్లగూడెం, మం॥ చేవెళ్ల, జి॥ రంగారెడ్డి.
సెల్ : 9393059077

# మహో మనీషి భీమయ్యగారు

-శ్రీ భూమానంద గుత్తికొండ దామోదర్‌రెడ్డి



భక్తానంద తూడిదేవమాంబ గారి ప్రియశిష్యులు శ్రీ నిర్మలానంద పిల్లలమఱ్ఱి భీమయార్యులు పరమ పదించిన వార్త విని చాలా విచారించినాను. పరిపూర్ణ సాంప్రదాయములో వారు ఒక గొప్పవ్యక్తి, వారితో నాకు గత 30సం॥ల నుండి అనుబంధము ఏర్పడినది వీరు గొప్పకళాపోషకులు ఔత్సాహిక నాటకాలలో అందె వేసిన చేయి, నగర సంకీర్తనలలో వీరిపేరు జగద్విఖ్యాతము. వరంగల్ జిల్లాలోగాని హైద్రాబాదులో గాని గొల్లగూడెంలో గాని విజయవాడలోగాని, ఏలూరులోగాని, తాడేపల్లి గూడెంలోగాని, విశాఖ పట్టణములో గాని శ్రీకాకుళంలోగాని, యిచ్ఛాపురంలోగాని, కాకినాడలో గాని, సిరిసిల్లలో, కర్ణాటక, బెంగుళూరులో గాని భారతదేశంలో ఎక్కడ పరిపూర్ణబోధలు జరిగినా నగర సంకీర్తన, వీనుల విందుగా నయనానందకరముగా సాంప్రదాయానుసారంగా భక్తులను ఉత్తేజపరచి రక్తి కట్టించేవారు, వీరి బృందము లేనిచోట, పేలవంగా ఉన్నదనుటలో అతిశ యోక్తికాదు.

శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమసేవా సమాఖ్యను అభివృద్ధిపరచుటలో వీరు చాలాకృషి సలిపినారు. సమాఖ్యలో వందలమంది యువకులను తన యుక్తి ప్రయుక్తులద్వార శిష్యులను చేర్చుకొని వారికి కర్తవ్యమును తెలియజేసి జననమరణ ప్రవాహములో కొట్టుకొని పోకుండా కడతేర్చిన మహానుభావులు. వీరి శిష్యులలో ఎంతోమంది బోధాధికారులైనారు. ఈనాడు, విశిష్టగుర్తింపు కలిగి సాంప్రదాయమునకు పేరు ప్రఖ్యాతులుతెస్తున్నారు.

శ్రీ నిర్మలానంద భీమయార్యులు నిరాడంబర వ్యక్తి. నిగర్వి. పేరు ప్రఖ్యాతుల కొరకు ప్రాకులాడేవారు కాదు. వీరు సేవా సమాఖ్యలో ఎన్నో సన్మానములను అందుకున్నవారు. రజిత కిరీటధారి, కర్నాటక, బెంగుళూరులో, విశిష్టగౌరవాన్ని, కిరీట ధారణపొందిన మహామనీషి, చివరగా తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడపట్టణ ప్రాంతములో చినబొడ్డు వెంకటాయ పాలెం, నిర్మలానంద ఆశ్రమములో వందలాది మంది పెద్దల సమక్షమున, బొడ్డు బైరవ స్వామి ఆరాధన సమయమున పౌర సన్మానము శ్రీబొడ్డు-సత్య నారాయణగారు. భీమయ్యగారికి, నాకు జరిపిన సన్మానము వర్ణనాతీము, శ్రీ నిర్మలానంధ పిల్లలమఱ్ఱి భీమయ్యార్యులు, సంస్మరణీయులు, వారికి, నా నమోవాకములు.


**భూమానంద గుత్తికొండ దామోదర్‌రెడ్డి**

శ్రీమదచలగురు పీఠ. రా. సే. సమాఖ్య, రాష్ట్ర అధ్యక్షులు,

పొట్లపాడు, జి॥ నల్లగొండ.

సెల్ : 9440226564


# మా ప్రేమాభిమాని భీమయ్యగారు

- శ్రీ దయానంద బాల్నాక్ పరమేశ్వరయ్య



పూజ్య శ్రీ గౌరవనీయులు అచల పరిపూర్ణులు శ్రీ నిర్మలానంద పిల్లలమఱ్ఱి భీమయార్యుల వారు పరమపదించినది విని చాలా దిగ్భ్రాంతి చెందినాము.

మా నాన్నగారు శ్రీదయానంద బాల్నాకు వీరయార్యుల వారి మండలారాధన సందర్భంగా శ్రీ నాగుల వెంకటేశం ఆర్యులవారి ద్వార వీరు మాకు పరిచయమయ్యారు. వారు చాలా మంచివారు. ఉత్సాహపరుడు, నగర సంకీర్తన కార్యక్రమములో ఎవరి పత్రికలోనైనా వారి పేరు ఉంటుంది. మొదటనే వారి ఆధ్వర్యంలో అని ఉంటుంది. ఊరేగింపు అంటేనే భీమయార్యులవారి ఆట, పాట అని అనుకునేవాళ్ళం.

13సం॥లుగా మా నాన్నగారి పూజకు తప్పక వచ్చేవారు. ఒక రోజు ముందు వచ్చేవారు. మా కుమారులను, మా కుటుంబ సభ్యులను శారదా సమేతంగా నన్ను ఎంతో ప్రేమగా ఆశీర్వదించేవారు. మా కుటుంబం అంటే ఆయనకు ఎంతో ప్రేమ. వారి మీద మాకూ అంతే ప్రేమ వారు లేనిలోటు సంప్రదాయంలో పూరించరానిది ! వారి స్మృతులు పరమావధిగా జ్ఞప్తి చేసుకుంటూ ఉంటాము ! వారి ఆరాధన ఉత్సవాలు విజయవంతం కావాలని కోరుతూ...

దయానంద బాల్నాక్ పరమేశ్వరయ్య

గౌలిగూడ చమన్, హైద్రాబాద్.

సెల్ : 9550599166

## బోధకమలంబులు వీరబూసిన కొలను భీమయ్య గారు

- శ్రీ పరమానంద సామవెంకన్న



కమలంబులున్న కొలనుకు భ్రమరము లేతెంచునట్లు బాగుగ బోధన్ తమమదిగోరి గురునిపద కమలములను గొల్వ సుజన గణమేతెంచున్

విరబూసిన అచలబోధ కమల పుష్పాలున్న కాసారం నిర్మలానంద పిల్లలమర్రి భీమయ్య గారు. అంతటి మహాత్ముడైన భీమయ్య గారి చెంతకు ఎంతో మంది సుజనులు ఏతెంచి సేవించి తరించినారు.

శివరామదీక్షితుల వారి సిద్ధాంతం బోధించి దానికి వ్యాప్తిని ఖ్యాతిని పెంచినారు. వారు నాగురు సమానులు, మా గురువు గారైన బోధానంద కాయిత వెంకటదాసు గారికి వీరు సోదర సమానులు. వీరికి నా హృదయ పూర్వక నమస్కారాలు.

పరమానంద సామవెంకన్న

గ్రా॥ చిన్నముప్పారం, మం॥ కేసముద్రం, జి॥ వరంగల్.

సెల్ : 9848710263

## బోధస్థితి పురుషుడు భీమయ్యగారు

- శ్రీ పూర్ణానంద గౌడుచర్ల బ్రహ్మానందరెడ్డి కదిరి



శ్రీ శివరామ దీక్షిత సిద్ధాంతం ఉన్నది. ఉన్నట్లు తెల్పి నిస్సందేహ స్థితిని కల్పించి ఘోర సంసార భ్రాంతిని పోగొట్టి నేను పుట్టనే లేదనే స్థితిని కల్పిస్తుంది.

ఇటువంటి ఉత్తమోఽత్తమమైన మార్గములో చేరి మానవ జన్మకు మాత్రమే కేటాయించ బడిన యధార్థమైన ముక్తిని పొందాలంటే అందరికి సాధ్యము కాదు. కాని ఈ అసాధ్యమైన అశరీరస్థితిని సుసాధ్యము గావించుకొని తనను ఆశ్రయించిన వారికి కూడా తాను పొందిన బోధస్థితిని పొందింపచేసిన గురువర్యులు "అచలబోధామృత గానమాధుర్య నృత్య వినోదాల రత్న" శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు సాంప్రదాయములో గొప్ప వ్యక్తి.

శ్రీ భక్తానంద తూడి దేవమాంబ గారిని దర్శించి సాష్టాంగ దండములు పెట్టి తను, మన, ప్రాణములు అర్పించి శుశ్రూలు చేసి అమ్మకృపకు పాత్రుడైన నిజగురుభక్తుడు మన భీమయార్యులవారు.

మన భీమయార్యులను నేను దయానంద నాగుల వెంకటేశమార్యుల గురుపూజలలో దయానంద బాల్నాక పరమేశ్వరార్యులు చేయు గురుపూజలలో చూశాను, ఇంకా చాలా చోట్లలో చూచితిని. ఎంతో నిర్మలముగా ఏ మాత్రము అహంకారమును ప్రదర్శించకుండా, ఎవ్వరిని నొప్పించకుండా, దేనిని విమర్శించకుండా అసూయా, ద్వేషాలు లేకుండా పూర్ణకళలతో బోధస్థితి పురుష లక్షణముతో ఉండేవారు.

భీమయార్యుల వారి సహధర్మచారిని మండ లారాధనకు మేము వెళ్లినప్పుడు, స్వామీ ! మీకుమారుడు సహధర్మచారిని బ్రహ్మైక్యము చెందినారు కదాయని పరామర్శచేయగా వారన్న మాటలు అమృతతుల్యములు "నాయనా బ్రహ్మానంద ! కలలో వివాహమై పుత్రులు కలిగినట్లు, కలగని మేలుకొని చూస్తే అది నిజమా? కాదు కదా, అట్లే ఈ సమస్త సతిసుత బంధు మిత్రులందరూ జాగ్రత్త అనే కలలో తోచిన వారే కదా!

ఎంత వరకు ఉండాలో ఉండి, వారి వారి వ్యవహారములు అంత వరకు నిర్వహించి పోతారు. పండితులైన వారు పుట్టే వారిని చూచి సంతోషపడరు. గిట్టే వారిని చూచి దుఃఖపడరు. అన్నింటికి మూల కారణమైన ఎరుకనే నేను కలవలె తోచినదని తీర్మాణ పరచుకొన్నవారు. దేనికి దుఃఖ పడరని ఎంతో నిబ్బరముగా, నిర్మలముగా అన్నారు. విని నేను సంతోషపడ్డాను.

భీమయ్యగారి శిష్యప్రశిష్యులు నాకు చాలా మంది తెలుసు. వారు బహుముఖ ప్రజ్ఞాశాలురు. అయినప్పటికీ ఏ ఒక్కరికి కూడా అహంకారము గాని ఈర్ష్యా, ద్వేషాలు కాని లేకుండా సాంప్రదాయానికి సేవచేస్తున్నారు. నిస్వార్థంగా సేవచేయుచున్నారంటే సకల సులక్షణయుతమైన జీవితము గడుపుతున్నారంటే అదంతా వారి గురువు గారి యొక్క సంకల్పనా బలమేకాని వేరుకాదు.

అనంతపురం జిల్లాలో తిమ్మమ్మ మర్రిమ్రాను ప్రపంచంలో అతిపెద్దచెట్టుగా గిన్నీసుబుక్కులో రికార్డు అయినట్లు శ్రీ పిల్లల మర్రి భీమయార్యుల శాఖ, శాఖోపశాఖలై విస్తరిల్లి శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయములో, ఆచరణలో, విచారణలో, ఐక్యతలో, సేవలో, త్యాగములో, సంఖ్యలో ఎదుగుతూ ముందుండాలని, ముందుంటుందనీ, ముందుందని భావిస్తూ సంచిక ఎడిటర్ ఉపేంద్రార్యుల వారి సూచన మేరకు సంక్షిప్తంగా ఈ వ్యాసం ముగిస్తున్నాను.

**కదిరి పూర్ణానంద బ్రహ్మానంద రెడ్డి**
గ్రా॥ దిగువతూపల్లె, మం॥ ఎన్.పి.కుంట, జి॥ అనంతపురం.
సెల్ : 8985085676

## భ్రమరకీటక న్యాయవేత్త భీమయ్య గారు

– శ్రీ సమరసానంద కుసుమ సముద్రం తిరుపతయ్య

శ్రీమత్ బృహద్వాశిష్ట సిద్ధాంతులు శివరామ దీక్షిత గురుపీఠ పరంపరులైన పెద్దలందరికీ భక్త బృందమునకు నాయొక్క హృదయ పూర్వక నమస్కారాలు.

అనంత సృష్టిలో అనేక ప్రాణికోట్లు, అందులో ఉత్కృష్టమైంది మానవ వుపాధి. ఆ మానవ ఉపాధి పొందినవారు తాము ఆచరించ వలసిన నిజధర్మం తెల్సుకోకుండా కాలగర్భంలో కలిసిపోయే వారు చాలా మంది ఉన్నారు. కాని శ్రీ నిర్మలానంద పిల్లల మర్రి భీమయార్యులు పాలంపేటలో వరంగల్లు జిల్లాలో సుప్రసిద్ధులైన అచల గురుడు. వేద వేదాంత భగవద్గీత, గురుగీత యోగవాశిష్టం ఇత్యాది గ్రంథములలో తెలిపిన రహస్యములన్నింటిని పరిశీలించి శిష్యులకు మిగతా సాంప్రదాయకులకు బోధించినారు. సిద్ధాంతంలో తనకు తెలిసిన అన్ని కళలను ప్రవేశ పెట్టినారు. రచనలు చేయటం, పాటలు పాడడం, నాట్యం చేయటం మొ॥ అన్నింటి ద్వారా బోధను సులభంగా అందించినారు.

వారు ఇప్పుడు భౌతిక రూపముగా మన మధ్యలేకపోయినా జ్ఞానరూపంగా స్థిరంగా భద్రంగా ఉన్నారు. భ్రమరకీటక న్యాయంగా ఎందరో శిష్యులను 26 మందిని గురువులను తీర్చి దిద్దినారు.

వారికీర్తిని వారి శిష్యులైన 26 మంది గురువులు సర్వవ్యాప్తం చేస్తారని ఈ సందర్భంగా నిర్మలానంద స్మృత్యర్థ సంచికకై ఈ నాల్గుమాటలు.

**సమరసానంద కుసుమ సముద్రం తిరుపతయ్య**
గ్రా॥ కుసుమసముద్రం, మం॥ కులక్‌చర్ల,
జి॥ రంగారెడ్డి. సెల్ : 9959239479

## శ్రీ భీమయ్య గారి శిష్యులు ధన్యులు

– శ్రీ గురుమాత సులభాదేవి చిల్లకూరు



శ్రీ నిర్మలానంద భీమయార్యుల వెంట అనేక సంవత్సరాలుగా తిరుగుతున్నాము. వారి కట్టుబొట్టు నడక చాలా హుందాగా ఉంటుంది అచలగురువులకు ఒక మోడల్ వీరి వేషధారణ, నాకనిపిస్తుంది. దీక్షితీయంలోని శివరామదీక్షితులు ఇప్పుడు ఉంటే ఇట్లానే ఉంటాడేమోనని !

సంప్రదాయములో అనుభవజ్ఞుడైన గురుడు భీమయ్యగారు, అహంకార రహితుడు. మా గురువు చిల్లకూరు అనుభవానంద స్వామితో వీరు చాలా అన్యోన్యంగా ఉండేవారు, మా గురువు గారి హస్తాల

మీదుగా వారి ఆశ్రమం ప్రారంభోత్సవం చేయించారంటే, అది మా భాగ్యం. అందరితో కూడా కలివిడిగా ఉండేవారు. హితంగా, మితంగా ఉంటూనే అమితంగా జనాకర్షణ కలిగిన గురుడు భీమయ్యగారు.

ఇంతమంచి గురునికి శిష్యులైన వాళ్లంతా ధన్యులే. భీమయ్యగారు రచయిత శిష్యులు రచయితలే భీమయ్యగారు పాడుతారు, పాడుతారు, భీమయ్యగారు ఉపన్యసిస్తారు. శిష్యులు ఉపన్యసిస్తారు. భీమయ్యగారిలో సమస్త ఉత్తమగుణాలు శిష్యులకు అబ్బినాయి అంటే అది భీమయ్య చలువ, ఆశీస్సులు సంకల్పం. ఇదంతా భీమయ్యగారి సోదరుడు నల్ల ఉపేంద్రయ్యగారు వ్రాసిన "పద్యాలల్లో చూడవచ్చును.

ఇక ధన్యులైన భీమయ్యగారి శిష్యులు వారి ఆశయ సాధనకై ఇప్పటికంటే ఇంకా ఎక్కువ కృషి చేయాలని కోరుతూ...

**శ్రీమతి సులభాదేవి,**

గ్రా|| చిల్లకూరు, జి|| నెల్లూరు.

## బహుముఖ ప్రజ్ఞాశాలి శ్రీ భీమయ్యగారు



- శ్రీ పూర్ణానంద బొద్దు సత్యనారాయణ

ఓరుగల్లులో పుట్టినా మొత్తం అచల బోధ ప్రపంచం అంతా గుర్తుపట్టే మహావ్యక్తి శ్రీ భీమయ్య గారు. వారి ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు బహుముఖ ప్రజ్ఞాపాటవాలు ఎందరినో ప్రభావితం చేసినవి ! వారిప్పుడు లేరు అని అంటున్నారు. కాని వారి పాట ఉంది. వారి మాట ఉంది. నాట్యం నాటి గణగణ గజ్జెల సవ్వడి ఉంది. వారు మొదటి తరానికి చెందిన అనుభవజ్ఞులైన గురువులని బోధస్థితి కుదిరిన గురువులని భావించి మొన్న మా ఆశ్రమం గుర్తించింది. వారు మా సన్మానాన్ని దయతో స్వీకరించి మమ్ముల ఆనంద పారవశ్యంలో ముంచినారు ! మా ఉపేంద్రన్నయ్య ఫోనులో చెప్పితే తెలిసింది. శ్రీ భీమయ్యగారికి శతసహస్రాధిక వందనాలు.

**పూర్ణానంద బొద్దు సత్యనారాయణ**

సంఘోద్ధారక, విద్యానిధి, అచల ఋషి నిర్మలానంద బొద్దు భైరవస్వామి ఆశ్రమ ప్రధాన కార్యదర్శి

గ్రా|| బొద్దుచినవెంకటాయపాలెం, మం|| తాళ్ళరేవు, జి|| తూర్పుగోదావరి. సెల్ : 9866173899

## భీమయ్యగారు లేని నగర సంకీర్తన పప్పు లేని అన్నం వంటిది.



- శ్రీ కృపానంద కోడం లక్ష్మీనారాయణ

సంప్రదాయంలో ఎందరో మహానుభావులు అచలబోధ ప్రచారంలో సిద్ధహస్తులు. వారందరికి మొదట నమస్కారాలు. భీమయ్యగారు లేని సభలను ఊరేగింపులను ఊహించుకోలేకపోతున్నాను. వారి మరణ వార్తను జీర్ణించుకోలేకపోతున్నాను.

సుబ్బరాయ నాయనగారిబోధ గురుప్రసాదమైతె, నాగుల వెంకటేశం గారిది షడ్రసోపేతమైన భోజనం. దామోదర్‌రెడ్డి గారిది పులిహోర ఫలహార మాధుర్యం. అయితె శ్రీ భీమయ్యగారు లేని నగర సంకీర్తన పప్పులేని అన్నంవంటిది. గురుగీత పఠనము ఉపేంద్రార్యులే చేయాలే. ఇది అందరికి తెలిసిన సత్యమే. సిరిసిల్లలో మాతంద్రి మరియు నా గురుదేవుడైన శ్రీ నిత్యానంద కోడం తిరుపతయ్యగారి వార్షిక సభలకు వారూ వారి శిష్యులు వచ్చి కార్యక్రమాలను రక్తి కట్టించేవారు. చక్రపాణి, బాబురావు వంటి ఎందరో శిష్యులను మనకందించి వెళ్లిపోయినారు. వారికి నిరంతర ద్వాదశ నమస్కారములు.

**శ్రీ కృపానంద కోడం లక్ష్మీనారాయణ**

భీవండి, మహారాష్ట్ర. సెల్ : 09970315070

## విజ్ఞాన-వినోదాల మేలు కలయిక భీమయ్యగారు



- శ్రీ బోధానంద బొద్దు అంబరీష్

భీవండిలో ఉన్న మేము మా స్వంత దేశం తెలంగాణకు పోతె వందలాది మంది గురువులు వాళ్ళ దర్శనం.

సభలు సమావేశాలు, బోధలు వినడం, ఒక వినోదం ఒక విజ్ఞానము, ఏ పూజకు పోయినా నగర సంకీర్తనలో భీమయ్య గారు నృత్యం, గానాల ద్వారా వినోదాన్ని, సభాముఖంగా పరిపూర్ణ బోధోపన్యాసాల ద్వారా విజ్ఞానాన్ని పంచియిచ్చిన మహానుభావుడు.

వారు మనమధ్య లేకపోవటం ఒక విధంగా

విచారకరమే అయినప్పటికీ ఎడబాటు సహజమని, మనస్సుకు సర్ధిచెప్పుకొన వలసివస్తున్నది. శ్రీ భీమయ్యగారు సమర్థులు శిష్యులను తనంత వారిగా తీర్చిదిద్ది మనకందించినారు. 26 మంది సైన్యాధ్యక్షులుగా ఈ బోధలో పర్యటిస్తారు. ఇది మనకు కొంత ఊరట కలిగిస్తున్నది. వారి మండలారాధన జరిపిస్తున్న వారి శిష్యులకు, పెద్దలకు దాతలకు కృతజ్ఞతలు. భీమయ్యగారికి ద్వాదశ నమస్కారములు.

**బోధానంద బొడ్డు అంబరీష్**
గ్రా॥ & మం॥ భీవండి, మహారాష్ట్ర. సెల్ : 09029262318

## భీమయ్యగారు పోతె పాట గతితప్పినట్లు, మాటపోయినట్లు, నృత్యం ఆగినట్లు అయింది.

- శ్రీ నిర్భయానంద చందంపేట బసవరాజు

భీమయ్యగారు సంప్రదాయంలో పెద్ద తరానికి చెందిన గురువర్యుడు తన కృషితో శిష్యులను తనంతటి వారిగా తయారుచేసిన మాన్యుడు.

వారున్నకాడ పాటపాడుతుంది. మాట పలుకుతుంది. నృత్యం గజ్జెకడుతుంది.

వారిప్పుడు లేరు. ఇది తీరని వేదన భరించరాని బాధ. జననం లేదు. మరణం లేదు. అనే సంప్రదాయంలో చర్చలెందుకని అంటారేమో, కాని ఆత్మీయత చంపుకోలేక అనురాగం మరచిపోలేక రెండు నిమిషాలు ఉన్నందుకు స్మరించుకోవటం.

మాట లేనట్టి బయలున మాట కలిగెననుట వినుట మాయే. మాయమైన దాంట్లోనే మన శ్రీ భీమయార్యులు ఒక వెలుగు. ఒకకాంతి పుంజం. వారుపోతె మాట మూగదైనట్లు, పాట శృతులు తెగినట్లు, నృత్యం లయదప్పినట్లైనది. వారి శిష్యులకు ఒక సూచన మీ గురువుగారు అందించిన సహకారం మీరు సాంప్రదాయములో అందిస్తారని ఈ సంచికకు నాలుగు మాటలు...

**నిర్భయానంద చందంపేట బసవరాజు**
గ్రా॥ & మం॥ సదాశివపేట, (పట్టణం) జి॥ మెదక్.
సెల్ : 9440032312

## దేవమాంబ కన్న గురుదేవుడు భీమయ్యగారు



- శ్రీ సదానంద దాసరి చంద్రమౌళి

శ్రీ శివరామ దీక్షితులు చెప్పిందే ఈ రెండు, మూడు వందల ఏండ్లుగా సాంప్రదాయ బద్ధంగా పీఠపాఠాలుగా బోధిస్తూ వస్తున్నాము. అనేక శాఖోపశాఖలుగా అయిదారు రాష్ట్రాలల్లో వర్థిల్లుతున్నది. అన్ని బోధలకవ్వలిది. అచల బోధయను పేరు గడించింది.

తెలుగు భాషలో ఉన్నందువల్ల ఈ బోధమర్మ ధర్మాలను ఇతర భాషీయులకు తెలియచేసే బాధ్యత తెలుగు వారిపై ఉన్నది. దీన్ని ఇంకా నిష్కలంకంగా బోధించే కొరకు సేవా సమాఖ్యను ఒక స్వచ్ఛంద సంస్థను శ్రీ బోధానంద బొద్దుల కృష్ణయ్య, శ్రీ నిత్యానంద బింగిరాజయ్య గార్లు స్థాపించి, వ్యవస్థాపక అధ్యక్ష, కార్యదర్శులుగా ఉండి వ్యాప్తి చేసినారు.

ఈ సందర్భంలో శివరామ దీక్షితీయబోధ ప్రచారంలో సేవా సమాఖ్య అభివృద్ధిలో శ్రీ భీమయ్య గారి పాత్ర గురించి కొంచెం..

ఆగదాసుగారి ప్రియ శిష్యులు దేవమాంబ గారు వారి శిష్యరత్నం శ్రీ భీమయ్యగారు. వీరు మంచి గురువులు. వీరి సోదరులు కూడా అత్యంత ప్రతిభా మూర్తులున్నారు. శ్రీ భీమయ్యగారు జీవితమంతా అచల బోధకు అంకితం చేసి జన్మ ప్రయోజనాన్ని అచలబోధ లక్ష్యసిద్ధిని సాధించినారు.

ఇరవై, ముప్పై ఏండ్లుగా వీరిని నేను అతి సన్నిహితంగా ఎరుగుదును. వీరిది ఒక ప్రత్యేక బాణి, అంతకుముందు తాను నేర్చిన లలితకళలన్నింటిని అచలబోధకు అన్వయం చేసి ప్రచారం చేయటం. ఇది సంప్రదాయానికి ఎంతో ఉపయోగపడింది. వీరికి కూడా కీర్తి ప్రతిష్ఠలు పెరిగినాయి. కవియై, గాయకుడై పాడటం. వీరభద్రఖడ్గ శరభ నృత్యాలను అచల నృత్యంగా మార్చి నగర సంకీర్తనలను అందగింప జేయటం. వందలాది మంచి శిష్యులతో అందులో 26 మంది గురువులను వెంట త్రిప్పుతూ ఎంతో

కృషి చేసినారు. పూర్ణగురుడు, పూర్ణాయుష్కుడు, అచలబోధ లక్ష్య సాధకుడై తేది : 16-08-2013నాడు మరణించినాడు. తేది : 24-09-2013 నాడు మండలారాధన జరుగుచుండడం అందులో సంచిక వేయడం ఆయన స్థాయికి తగినట్లుగా శిష్యులు చేస్తుండటం బాగుంది. వారికి నా ద్వా॥ నమస్కారాలు.

సదానంద దాసరి చంద్రమౌళి గారు
గ్రా॥ పెంచికలపేట, మం॥ ఎల్కతుర్తి,
జి॥ కరీంనగర్. సెల్ : 9395372967

## గురువులకు గురువు భీమయ్యగారు

- శ్రీ ప్రేమానంద బొప్పరామయ్య



శ్రీమదచల గురుపీఠ రాజయోగా శ్రమ సేవా సమాఖ్య శ్రీ భక్తానంద తూడి దేవమాంబ ప్రియ శిష్యులు శ్రీ నిర్మలానంద పిల్లలమఱ్ఱి భీమయార్యులు వీరు మంచి గానము, ఆచల తత్వములు వీరు పాటలతో ఎందరో మహానీయులచే మంచి కళా కారునిగా గుర్తింపు పొందారు. వీరు వీరి శిష్యులు గూడ మంచి కళా కారులుగా, కవులుగా యుండిరి. వీరి శిష్యులలో బండిచక్రపాణి, బాబురావు, తంగళ్ళపల్లి రాజేంద్ర ఇటువంటి కళాకారులు గీదమోహన్‌రెడ్డి, పోరెడ్డి రమణారెడ్డి గారు వీరి శిష్యులు, వీరు అందరూ కలిసి గురు పూజలలో పాటలు పాడుట ఉపన్యసించుట చూడగా గురువుకు తగ్గశిష్యులని భావించనైనది. "వారీ వినకున్నా వేమిరా నేనెంత దెల్పిన వారీ విన్నకున్నా వేమిరా"అని పాడుచు నాట్యము చేయుచు చిరునవ్వులు చిందిస్తూ ఆత్మానందముగా అందరిని ఆనందింప చేసేవారు. కోలారు పట్టణములో రజిత కిరీటం ధరించిన వారు మహారాష్ట్ర మరియు కాకినాడ అనుబంధ పీఠములుయున్న స్థానములలో వారిదే మొదటి గానము అందులో కళాకోవిదులు వీరు లేని లోటు మన సాంప్రదాయముకు తీరని లోటు. వారిని స్మరించుకుంటూ....

ప్రేమానంద బొప్పరామయ్యార్యులు
గ్రా॥ పెద్దలింగాపురం, మం॥ ఇల్లంతకుంట,
జి॥ కరీంనగర్. సెల్ : 9573841094

## భక్తులను తరింపచేయుటకు వచ్చిన కారణ జన్ముడు భీమయ్యగారు

- శ్రీ శ్రద్ధానంద డా॥ చేర్యాల బలరాములు



శ్రీ పూర్ణానంద ఆగదాసు గారి శిష్యురాలు శ్రీ భక్తానంద తూడి దేవమాంబగారు వీరి శిష్యులు శ్రీ నిర్మలానంద పిల్లల మఱ్ఱి భీమ యార్యులు.
వీరు రాజలింగయ్య, రాజమ్మ దంపతులకు జన్మించిరి. శ్రీమతి ఉత్తరాంబను ధర్మపత్నిగా వివాహమాడిరి. వీరికి నలుగురు కుమారులు, ఇరువురు కుమార్తెలు. 86 సం॥రల పూర్ణ వయస్సున వారి స్వగృహమున అనాయాసముగా తేది : 15-08-2013 రాత్రి 3.30ని.లకు బ్రహ్మైంద్రైక్యమునొందిరి. శ్రీ శివరామ దీక్షితాచల పరిపూర్ణ బోధను వీరు బాల్యదశయందే గురువునాశ్రయించి, గురు ధర్మమును తెలుసుకొని నాలుగు శుశ్రూషలచే భయభక్తిగల శిష్యునిగా నిలిచి భక్తి కీర్తనల గ్రంథరచనతో గురువును మెప్పించిరి.

ఆశ్రమము నిర్మించి త్రికరణ శుద్ధిగా గురుసేవకే అంకితమై దాదాపు 600 మంది శిష్యులను, అందులో 26 మందిని బోధాధికారులను చేసి విచారణ, ఆచరణ మరియు అనుష్ఠాన విధానములతో తీర్చిదిద్దిరి. సమాఖ్యయందు వారూ వీరూ అనక అందరికి బోధనందించిన సద్గురుదు భీమయార్యుల వారు.

అచలతత్వ గాన, నృత్య, కళారత్న బిరు దులతో వెండి కిరీట కుండలములతో సత్కరింప బడిరి. 50 సం॥రలకు పైగా కృష్ణ దేశింకేంద్రులు తెలిపినట్లు నీకు తెలుపుటకిట్లు ప్రభవించినాను అను నిర్ణయముగా **"భక్తులను తరింపచేయుటకు వచ్చిన కారణ జన్ముడాయన."** దయార్థ్ర హృదయులు ఎట్టి సంఘటన నైన ఎదురించగల ధీశాలి. వారి కుటుంబ సభ్యులకు శాంతి కలగాలని తేది : 24-09-2013 రోజున వారి మండలారాధన, కార్యక్రమము విజయవంతం కావాలని ఈ సంచికాముఖంగా కోరుకుంటున్నాను.

శ్రద్ధానంద డా॥ చేర్యాల బలరాములు
రాజగోపాల్‌పేట, మం॥ నంగునూర్, జి॥ మెదక్.
సెల్ : 9666893523

## సాంప్రదాయకులు మరచిపోనంతటి మహా వ్యక్తి భీమయ్యగారు

- శ్రీ రామానంద రుద్రారం రామగౌడ్



కళా కోవిదులు, నాట్య ప్రపూర్ణులు, శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల మొట్ట మొదటి దర్శనం హైద్రాబాద్ కార్వాన్ శ్రీ భాగవత కృష్ణ దేశి కేంద్రులవారి ఆశ్రమంలో జరిగినది.

అప్పటి నుండి వారు మరియు వారి శిష్యులు ప్రతి గురుపూజ కార్యక్రమంలో పాల్గొని సంప్రదాయ గురువులను, గురుభక్తులను అందరిని పాటల ద్వార బోధల ద్వారా ఆకర్షిస్తూ ఉండేవారు. వారి విధానమంతా సులభోపాయముగా ఉండేవి. శివరామ దీక్షితుల పీఠపాఠాలు-బోధలు అర్థమయ్యేవి. వారి నృత్యం అనితర సాధ్యం. ఆనందంగా ఉండేది.

అట్టివారు ఐక్యమైందని శ్రీ బండి చక్రపాణి అన్నయ్య గారు మాకు ఫోన్ ద్వారా తెలిపిరి. ఇట్టి మహానుభావుడు దొరుకుట చాలా అరుదు. పరిపూర్ణ బోధలో, సేవా సమాఖ్యలో ఒక మహాగురువును కోల్పోయినాము. సాంప్రదాయక గురువులు మరియు పెద్దలు ఈ గుర్తు ఉన్నంత వరకు జ్ఞాపకం ఉంచుకొందురు.


రామానంద రుద్రారం రామగౌడ్

గ్రా॥ అంబం, మం॥ బోధన్, జి॥ నిజామాబాద్.

సెల్ : 9908474812


## సంప్రదాయమునకు ఎందరినో గొప్ప వారసులను అందించిన మహా మనిషి

- శ్రీ పూర్ణానంద ఊరెల్లి విఠ్ఠల్‌రెడ్డి



ఆత్మబంధువుల్లారా ! శ్రీమధచల గురుపీఠ సాంప్రదాయక గురు వర్యులైన సద్గురుమూర్తి శ్రీనిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల వారు మనమధ్యన లేరు. ఇది ఎంతో విషాధకరం. వీరు నాట్యకళాకోవిదులు, మంచి యోగ్యతకలిగిన పీఠాధిపతి. వీరు వారి గురువులను సేవించి తరించినవారు. వీరు ఎందరినో శిష్యులను చేర్చుకొని వారికి సంపూర్ణ జ్ఞానాన్ని ఇచ్చినారు. సాంప్రదాయమునకు ఎందరినో వారసులను అందించిన మహామనీషి ! సాంప్రదాయమందు వచ్చిన గురు పుత్రులు గురువును సేవించి సంపూర్ణమైన జ్ఞానాన్ని గురుముఖత వినితరించండి.

శృతి : ఉత్పత్తి వినాశరహిత మనంతం ! షడ్భాధ వికార రహిత మనంతం ! సర్వోపాధి వినిర్ముక్త మనంతం ! సర్వవ్యాప్తం బాహ్య బ్రహ్మమనంతం ॥ పరిపూర్ణ పరబ్రహం ఆద్యంతములు లేనిది. అందుకే దానిని అనంతం అన్నారు. దానికి ఉత్పత్తి వినాశనములు లేవు. షడ్భావములు కూడా లేవు. ఎట్టి విధములైన ఉపాధులు లేవు. అది పుట్టలేదు. పుట్టించలేదు. పుట్టని దానికి చావు ఎక్కడుంది. తనకు తానే అయి వెలుగొందుచున్నది. ఆ బట్ట బయలులో గుణ ప్రకృతి కాని, జడ ప్రకృతిగాని ఈ షన్మాత్రముగా కూడ లేదు. అటువంటి అచల పరిపూర్ణ పర బ్రహ్మమునకు ఆకారము లేనందున, ఏ నామము కూడా ఉండదు. గమనా గమనములు - తేజోంధ కారములు జగదాత్మలు సిద్ధి - బుద్ధి ముక్తా పేక్షలు నేను మేనులు ఏమి లేవు. లేని దానిలో లేకతోచిన భీమయార్యుల వారు జనన మరణ భయభ్రాంతులను వీడినారు. వారి ప్రత్యేక సంచిక ద్వార నా ద్వాదశ నమస్కారాలు.


పూర్ణానంద ఊరెల్లి విఠ్ఠల్‌రెడ్డి

శ్రీనగర్ కాలనీ, భవానినగర్, నాచరం,

హైద్రాబాద్. సెల్ : 9290599299


## చక్కగా తిలకించే చెక్క భజన ఇక లేదు.

- శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు



శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు నాకు శ్రీ బాల్నాక్ వీరయార్యుల ప్రథమ వార్షికారాధన సమయము నుండి పరిచయము అనగా సుమారు 15 సం॥లకు పైగానే అయినది. ఆనాటి నగర సంకీర్తనల్లో శ్రీ నిర్మలానంద భీమయార్యులు చాలా చక్కగా (నటించుచు) చెక్రిభజన

చేసుకుంటు నగర సంకీర్తన జరిగి యుండెను. అనాటి నుండి ఈనాటి వరకు శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు అనగానే ఆనాటి దృశ్యము కండ్లల్లో మెదిలాడుతుంది. !

అంతేకాదు వారు భక్తులచే రజిత కిరీటము ధరించి, రజిత కిరీటధారులైనారు. భారతదేశములో విచారణ చేయగ రజిత కిరీటధారులను ఏల్లమీద లెక్కించవచ్చును. అందులో ఒకరిని కోల్పోయినాము అంటే ఇది సమాఖ్యకు ఒక విధముగా లోటనే చెప్పాలి. ఆనాత్మ సంబంధమైన విశ్వము ఈ విశ్వములో - మానవులు - మంత్రోపాసకులు-భక్తులు మతముల వారు-యోగాభ్యాసకులు-తత్వ విచారకులు ఉంటారు. ఇందులో శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల శరీరము భక్తిమార్గము నుండి వచ్చి మాతృశ్రీ భక్తానంద తూడిదేవమాంబ గురువు వద్దకు చేరి ఆత్మను తెలుసుకొని ఆత్మకు అతీత పద్ధతిలో శరీరం వదిలినారు అనగా ఇకలేని వారు ఆయెను తిరిగిరాని వారు ఆయెను. ఇదే శ్రీ శివరామ దీక్షిత సిద్ధాంత మార్గము అదే మా జోహార్లు...


శ్రీ సద్గురు కటాక్ష శ్రీ విజయానంద

**విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు**

ఇ.నెం. 1-4-27/71/29, పద్మశాలి కాలనీ,

గాంధీనగర్, హైద్రాబాద్ - 500 080.

సెల్ : 9849560048, 9030445858


## నిరాడంబరంగా జీవితాన్ని గడిపినారు భీమయ్యగారు

- శ్రీ నిర్మలానంద వనమాల లింగమయ్య



నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు పూర్ణాయుష్కులు. వారు ప్రాపంచిక వ్యవహారము లందు, పారమార్థిక వ్యవహారములందును సంపూర్ణమైన బాధ్యతను పూర్తి చేసుకొన్నవారు. వారు భుక్తి, ముక్తి క్రియలయందు మరియు సంప్రదాయం, క్రమశిక్షణతో ఉన్నవారు. వారిని నేను చాలా తక్కువ సార్లు చూసినాను. మరియు వారి సతీమణి మండలారాధనకు వెల్లియుంటిని, అప్పుడు వారి విషయము తెలిసింది. వారు నిరాడంబముగా జీవితాన్ని గడిపిన వారు. వారు ఈ సాంప్రదాయ మునకు ఎనలేని సేవ చేసినారు. బృహద్వాదిష్ట సాంప్రదాయక పరంపరులకు ఎందరినో గొప్పవైన పూర్ణబోధాధికారులైన శిష్యులను 26 మందిని అచలగురువులుగా మనకందించినారు వీరు మన సాంప్రదాయ గొప్పగురువులలో ఒకరు. వీరికి నా యొక్క ద్వాదశి వందనములు.

భక్తాగ్రేసరులారా ! ఈ మానవజన్మరావటము ధుర్లభము, అందులో వివేకవంతులగుట అతి దుర్లభము. అట్లే ఈ బృహద్వాశిష్ట సిద్ధాంతానికి రావడము ఈ మానవులలో లక్షకు ఒక్కరని చెప్పు కోవచ్చు. మానవ శరీరములో నీవెవరు ? పంచతన్మాత్రలతో ఏర్పడ్డ ఇంద్రియాలు నీవుకావు. వాటిని అనుభవానికి తెచ్చుకొనువాడవు నీవు. ధర్మ, అర్థ, కామ, మోక్షములనే పురుషార్థాలు ఈ ఒక్క మానవునికే వర్తిస్తుంది. సృష్టిలో ఉన్న 84 లక్షల జీవోపాదులకు వేనికి వర్తించదు. ఈ మానవ శరీరానికి మాత్రమే అర్హత వున్నది మోక్షానికిగాని మోక్షాతీతానికి (జన్మ రహితమునకు). కావున ఆత్మబంధువుల్లారా ! ఈ జన్మను వృధాచేయకండి. సమయము చాలా తక్కువ వున్నది. సంపూర్ణమైన ఆరోగ్యం ఉన్నపుడే, చేతులు, కాల్లు, కండ్లు, చెవులు, నోరు అతి ముఖ్యమైనవి. వినుటకు, చూచుటకు, మాట్లాడుటకు. ఉన్న సమయమును పొదుపుగా వాడుకొని అశరీరులైన అచల సద్గురువులచేరి సాఖ్యతారక, అమనస్కా మహావాక్యముల గురుముఖత పూర్తి చేసుకొని పూర్ణబోధ పొందండి. తరించి, ఇతరులను తరింప చెయ్యండి.

1. ద్వాదశాక్షర మహామంత్రము :-
ఏతత్ మిథ్యాశుద్ధవియత్ కించిన్నాస్తి ఈఉత్తబట్ట బయలు ఏమీలేదు.
2. షోడశాక్షరి మహామంత్రము :-
నిర్మూలమే తదా జ్ఞాన శరీరం నాస్తికేవలం॥
మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఏమిలేదు.
3. పంచదశి-దృష్ట-ద్రాష్టాంతం :-
స్వప్నేప్రతీయ మాన రూపానిచ యధాతథా।

కర్పూర దీప సంయోగం జ్యోతిరూపం యథాతథా ॥

మూలములేని శరీరాలు ఏమీలేవు ఎట్లాగంటె కలదోచిన శరీరాలు ఎలాగో అలాగే. యీ ఉత్త బట్ట బయలు తప్ప ఏమిలేదు అనే బోధనతోశేష జీవితాన్ని గడుపుకొనవలెను. నేను లేని స్థితిలో అంటి అంటని లక్షణములో కార్యములు చేస్తూ శేష జీవితములో నడవండి. అట్లా నడిచి నడిపించిన భీమయార్యుల ఆరాధనలు విజయవంతమగు గాక..


శ్రీ నిర్మలానంద వనమాల లింగమార్యులు
ఇ.నెం. 12-1-250, లాలపేట,
సికింద్రాబాద్-500 017. సెల్ : 9246163688


## భక్తానంద మాత బోధ వైభవం



- శ్రీ సదానంద వేముల సత్యనారాయణ

శ్రీమదచల ప్రబోధ భక్తానంద తూడి దేవమాంబ రాజయోగిని గారి40వ వార్షికారాధన సందర్భమున అంద జేయు చతుర్పద్యమాల

ఆ॥వె॥ శివనగరులో ఘన । సిద్ధాంత పరమైన
నవసమాజముమేల్క । ననుభవింప
భవజన్మ సఫలత । భ్రాంతిరహిత బోధ
వివరంబుదెల్పుడో । వినమ్రులారా !

ఆ॥వె॥ శివరామ దీక్షిత । సిద్ధాంతమిదియంచు
వరగురుశిష్యుల । వివరమెరిగి
నవనాగరికతన । నానందమొనరింపు
కవులగాన కళల । కోరివినుడి

ఆ॥వె॥ దేవమాంబబోధ । దేదీప్యమానంబు
కోవిదపరనుతి । గొప్పఫలితం
జీవభ్రాంతిదొలగి । జయమునొందగోరు
భావ, పూర్ణభోధ । పరమసుగతి

క॥ విన్నారా యెరుక భ్రమలను
కన్నారా శుద్ధనిర్గుణమను । కాలాతీతున్ ఆ
కొన్నారా గురుదీక్షనుపద
మ న్నారాసదమల సత్య । మున్నబయలునన్


సదానంద వేముల సత్యనారాయణ
పోస్ట్ : దంతాలపల్లి, మం॥ నర్సింహులపేట,
జి॥ వరంగల్. సెల్ : 9912426132


## మరుపురాని మరిచిపోలేని వ్యక్తి మా మామయ్య

- శ్రీ పోతునూరి శశిరేఖ-శేఖరయ్య



నాకు ఊహతెలియకముందే అమ్మా నాన్నలు జరిగిపోయారు. నేను తన అక్కకొడుకునని, తల్లితండ్రులు లేని అబ్బాయిని. అని బాగా ఆలోచించే వాడు, ఎలాగైనా ఇతడిని జీవితంలో పైకి తీసుకు రావాలని తాపత్రయ పడేవాడు. తన స్వంత పిల్లలకన్నా నామీదే ఎక్కువ ప్రేమ చూపించేవాడు. ఆయనకు సర్వకాల సర్వావస్థలయందు కృతజ్ఞున్ని. అప్పుడు మా మేన మామ భీమయ్యగారు నన్ను చేతపట్టి కొద్దిరోజులు తనవద్దే ఉన్న తర్వాత, తన శిష్యుడైన నారాయణ పురంనకు చెందిన రామ్మూర్తి వద్ద టైలరింగ్ వృత్తిలో చేర్పించినారు. 22సం॥లు వచ్చిన తర్వాత తన కూతురు వయస్సులో చిన్నది కావున తన తోడళ్ళుడి కూతురుని మాట్లాడి పెళ్ళి జరిపించినాడు. కొద్ది రోజులు చిట్యాల మండలం వెలిశాలలో ఉన్నాము. తర్వాత గోదావరిఖనికి వెళ్ళి అక్కడ కొద్ది రోజులు టైలర్ షాపు నిర్వహించినాను. ఇప్పుడు సింగరేణిలో ఉద్యోగిగాచేరి, అంచెలంచెలు ఎదిగి సీనియర్ మైనింగ్ సర్దార్‌గా రిటైర్డ్ అయి వరంగల్‌లో స్థిరనివాసం ఏర్పరుచుకొని ఉంటున్నాను. అయితే నా జీవితంలో ఇవ్వాల ఈ స్థితిలో ఉన్నామంటే దానికి కారణం మా మామగారే. చిన్నతనంలో చేరదీయక పోతే నా పరిస్థితి ఎలా ఉండేదో చెప్పలేను. నా జీవితంలో మరుపురాని, మరిచిపోలేని వ్యక్తి భీమయ్య గారు.


పోతునూరి శశిరేఖ-శేఖరయ్య
హరిహర ఎస్టేట్, అపర్ణ బిల్డర్స్
ఇ.నెం. 6-184, గొర్రెకుంట, వరంగల్.
సెల్ : 9705670209

## శ్రీమించు అచలబోధలో స్థిత ప్రజ్ఞులు భీమయ్యగారు

- శ్రీ సదానంద బానాల సాంబయ్య



శ్రీమత్ శివరామ దీక్షితులవారు ప్రతి పాదించిన పరిపూర్ణభావము "అచలోయంసనాతనః" అన్న అచల సిద్ధాంతం గురుపరంపరా ప్రోక్తమై ప్రచారంలో ఉన్నది.

ఏది తెలిస్తే అన్ని తెలియ బడతాయో దాన్ని తెలుసుకోవటం "బ్రహ్మై" వాహమస్మి॥ దేన్ని విడిస్తే అన్ని విడువబడుతాయో దాన్ని విడువడం 'అహం పదార్థ రహితః" ఇదియే అచల ఋషి సంప్రదాయం! ఇట్టి స్థితిని పొందిన వారే అచలబోధలో స్థిత ప్రజ్ఞులైన శ్రీభీమయార్యులవారు. వీరు గురువుల కోవలో ప్రసిద్ధి చెందినారు. వీరు పెద్దపెద్ద సభలల్లో అధ్యక్ష, ఉపాధ్యక్ష పదవులను అలంకరించి ఉపన్యసిస్తూ ఘవ సన్మానములు పొందినారు.

ఎరుకను విడనాడిన ఆ పురుషుని స్థితి భీమయార్యులల్లో కాంచనగును. ఈ రీతి స్థితిగలిగిన నేరుపుశాలి నూటికొక్కరు కోటికొక్కరని చెప్పవచ్చును. వీరు నాకు 1995లో సుపరిచితులు 2001లో మా స్వగ్రామం గంపోని పల్లెకు వచ్చినారు. వారు వారి శిష్యకోటితో సకల రాజ్యాలు తిరిగి ఎంతో ప్రఖ్యాతి గాంచినారు.

గురుమూర్తి ఇచ్చిన సమయాన్ని పూర్తిచేసు కొని గురూపనిష్ఠలో లయమైన వారి పాదపద్మ ములకు ద్వాదశ నమస్కారములు అర్పిస్తూ....

సదానంద బానాల సాంబయ్య
గ్రా & మం॥ ములుగు, జి॥ వరంగల్.
సెల్ : 9505182082

## అచల బోధలో - ఆగదాసు కవితా మాధుర్యం

- శ్రీ నల్ల ఉపేంద్రార్యులు గారు



"అభినవ ఆగదాసుగారు భీమదాసు" గారి మండలారాధన సందర్భంలో. ఈ వ్యాసం సమర్పణ. అచలబోధ-ఆగదాసు కవిత్వం గురించి, ఒక విశ్లేషణ.

అచలబోధ ప్రచారం కోసం పూర్ణానంద వాడపల్లి ఆగదాసు గారు కవిత్వం వ్రాసినారు. వారు వ్రాసిన రెండు గ్రంథాలు రెండు మహాకావ్యాలు ఒక్కటి పద్యకావ్యమైతే రెండవది గేయ కావ్యం పద్యకావ్యం ఛందోబద్ధమైన సీసశతకమైతే రెండవది మాత్రా ఛందస్సులో వ్రాయబడిన గేయ కావ్యం. ఒకటి శ్రీ వేంకటేశ్వర శతకం. రెండవది పరిపూర్ణబోధ మార్గదర్శిని. రెండిట్లో యతిప్రాసల విలాసము అద్భుతంగా సాగింది. శతకంలో అంత్యప్రాసలు అద్భుతం. మార్గదర్శినిలో ప్రాసక్రీడలు. చేయి తిరిగిన ప్రౌఢకవి ఆగదాసు గారని ధృఢ పరుస్తున్నాయి.

ముందు మార్గదర్శినిలోని గేయ కవిత్వం గురించి రెండు మాటలు. ఈ గ్రంథం 80, 90 పేజీలైతే మొదటి 30, 35 పేజీలు సాంఖ్యతారక అమనస్క పరిపూర్ణం మొ॥ శీర్షికలతో గద్యరచన. ఇకపోతే 50 పేజీలు గేయాలు. అందులో దీర్ఘ కవితలు మూడు ఒకటి ద్విపద నూటనలభై ఆరు చరణాలు, రెండవది బతుకమ్మ పాట మూడవది భక్తజన హితబోధతత్వము. ఇది 28 చరణాలు. 34 గేయాలు. అన్నీ ఆణిముత్యాలే ఇందులో ప్రతిగేయంలో ఆగదాసు గారు ద్వాదశి, షోదశి, పంచదశి మూడింటి సారాన్ని వరుసగా తెలియచేస్తారు. శబ్ద సౌందర్యం, అర్థగౌరవము, భావస్పష్టత కొరకు అనేక ఉదాహరణలలో దృష్ట ద్రాష్టాంతాలతో అలంకార ప్రాయంగా వ్రాస్తారు, ప్రతి పాటలో పాటలోని ప్రతి చరణంలో ప్రాసక్రీడలు తాండవమాడతాయి. అక్కడక్కడ వక్రోక్తులు ఉంటాయి. చమత్కారాలు ఉంటాయి. ఉదాహరణ :- "ముండకొడుక ఇకముందు జన్మరాకుండ చేసుకోర. మొండి వాదములు మాని సద్గురు అందజేరుకోర" ఇదేంటి ఆగయ్యగారు,

ముండకొడుకయని సంబోధించారు. ఇట్లా ఎగతాళి చేయటం తగునా అని ప్రశించిన వాళ్లకు తగిన సమాధానం చెప్పుతాడు. తాతగారు. చూడండి పరిపూర్ణబోధ సంప్రదాయం ప్రకారం లేనిది ఎరుక, అట్టి ఎరుక స్వరూపుడైన మనిషికి బోధ చేయాలన్నప్పుడు ముండకొడుకని సంబోధించటంలో ఔచిత్యానికి ఏమీ భంగంలేదు. ముండకు కొడుకు పుడుతాడా ? పుట్టడుకదా. అందుకే ఓలేని ఎరుక స్వరూపుడా అను అర్థం స్ఫురించుటకు చేసిన చమత్కారమే తప్ప ఎగతాళి లేదు. హేళన కాదు. ఇంకొకటి "తల్లిదండ్రులు లేని పిల్లవాడవు నాతో ఎల్లకాలము ఉంటే మళ్ళీ రావన్నాడు. మంచీ వాడమ్మ సద్గురుడు భలె మంచి వాడమ్మ"ఇందులో తల్లిదండ్రులు లేని పిల్లవాడవు అంటే గురువు దగ్గరకు వచ్చిన వాళ్లంతా తల్లిదండ్రులు లేని వాళ్లా ! అనాథలా ! దిక్కులేని వాళ్ళా! అని ప్రశ్న ఉత్పన్నమౌతుంది. కాని ఇక్కడ కూడా పూర్వం చెప్పిన అర్థాన్నే గ్రహించాలి. తల్లిదండ్రులు లేకుండా ఎవరు పుట్టరు. ఇక్కడ పుట్టనివాడా ! లేని వాడా ! అని మాత్రమే అర్థం చేసుకోవాలే ! ఇట్లాంటి ఎన్నో శబ్దార్థ చమత్కారాలు అచలబోధకు పుష్టినికలిగించేవే కాని వ్యర్థపద ప్రయోగాలు కానేకావు. ఉత్తమాటలు చెత్తమాటలు ఆగదాసు కవి గారికి అవసరమేలేదు. ఇక ప్రాస గురించి చరణంలో మొదటి అక్షరం తర్వాత రెండవ అక్షరం ప్రాస ఈ ప్రాస చరణం అన్ని పాదాల్లో ఉంటే అది ప్రాస నియమం అని అంటారు. ఇందులో ఆగదాసు గారు సిద్ధహస్తుడు అతడు వ్రాసిన అన్ని పాటలల్లో ఈ నియమం ఉంటుంది. ఉదా:- "చెప్పరానీ బాధలచె నేతిప్పలా బడుచుంటిరా, అప్పుడిప్పుడేయనక నీవిప్పుడేరారా" ॥రారాసద్గురుదేవ॥ ఇందులో పాదంలోని రెండవ అక్షర (ప్ప) ద్విరుక్త పకారం.దీన్ని రెండవపాదములో కూడా వాడుకున్నారు.

"చొక్కమైన బోధచెప్పి అన్నప్పుడు, (క్క)రెండవ అక్షరం అదిరెండవ చరణంలో ఎక్కాడెక్కడా వెదకిన అని ఉన్నది. ఇట్లా ప్రతిపాటలో మీరీ విషయాన్ని చూడవచ్చును.

రండి గురుపుత్రులారా ! ఈ చరణలో నున్నపూర్వక డకారం. (ండి) ఇది ఈ చరణం అయిపోయే వరకు ఈ నియమం ఉంటుంది. రెండవ చరణంలో వచ్చి పొయ్యేబాట ఇక్కడ రెండవ అక్షరం (చ్చి) ప్రాస ఆచరణం అయిపొయ్యే వరకు (చ్చ) వస్తుంది. అంటే ప్రాసనియమం ఉంటుంది. ఇట్లా అన్ని పాటలు గ్రహించగలరని పాఠకులకు విజ్ఞప్తి. ఇక వేంకటేశ్వర శతకంలో వంద పద్యాల వ్రాసినా సీసం మొత్తం సమాజం కొరకే. తేటగీతిలోని రెండు చరణాలల్లో మాత్రమే అచలబోధ చేస్తారు. ఆగదాసు కవి ఎంతో సమర్థుడైన కవి అయినందు వల్ల ఇది సాధ్యమైంది. మొత్తం అచలబోధలో భాగవత కృష్ణ ప్రభువునుండి ఇప్పటి వరకు వ్రాసిన కవుల్లో ఛందోబద్ధమైన కవులల్లో ఇంతటి ప్రతిభా పాటవాలు కలిగిన కవులు అరుదు.

ఉదా:- అలు పిల్లలు నావారలంచునరుడు
మమత చెందగ చూచిపెన్మాయనవ్వు

ఇది అచలబోధకులకు ఇచ్చే సందేశం. ఈ నవ్వు ధృఢం కావటానికి సీసంలో నాల్గు రకాల నవ్వులు చూపిస్తారు. "తనయునెత్తుక తండ్రి దయతొముద్దాడంగ పరికించి జారత్వ భార్యనవ్వు" ఇందులో ఆగయార్యుల వారి భావతీవ్రతను చూడాలె కాని వేరుగా యోచించ రాదు. ఇట్లాంటి పద్యాలతో ఈ శతకం శోభిస్తున్నది. ఇక అంత్య ప్రాసల గురించి, మార్గదర్శిని గేయాలలో ప్రాసనియమము ఎంత ఉచితంగా పాటించినారో ఈ పద్యాలల్లో అంత్య ప్రాసలు అంతసునిశితంగా వాడుకున్నారు కవీంద్రులైన దేశికేంద్రులు మా తాత ఆగయార్యులు.

ఆగదాసు గారు జీవితంలో అనుకూల ప్రతికూల సమస్యలను ఎన్నో ఎదుర్కొన్నారు. సమర్థులు కనుక సమకాలీనులను ఒప్పించగలిగారు, మెప్పించగలిగారు. ఇక ఒక లేఖాసందర్భంతో ఈ వ్యాసం ముగిస్తాను. గురువర్యా ! ఆగయార్యా నమస్తే! వారిజనేత్రీ! హస్తగమన అంటే అర్థం చెప్పండి అని. లేఖ సారాంశం. దానికి జవాబుగ, వారిజనేత్రి అంటే వాడపల్లి, హంసగమన అంటే ఆగదాసు అని జవాబు పంపించినారు. చతురుడు సద్గురుడు, జీవితాన్ని గురుబోధలో గడిపిన ఘన గురుని శిష్యురాలు తూడి దేవమాంబ కావటం. ఆ దేవ మాంబకు నేను శిష్యున్ని కావటం గర్వంగా భావిస్తూ వారి బోధ ప్రచారంలో ఇదొక ప్రయత్నం.

## మా గురువు సోదరుడు
## మాకు గురుతుల్యులు శ్రీ భీమయ్య గారు

- శ్రీ బ్రహ్మానంద పినుమళ్ల జ్ఞానేశ్వరయ్య



శ్రీ భీమయార్యులవారు దేవమాంబ గారి శిష్యులల్లో ప్రథమంగా ఎన్న దగినవారు. వారు మా స్వగురు బలభద్ర పరమేశ్వరాంబ గారికి సోదరులు వీరు గురువు గార్కి సకల సౌకర్యాలతో కూడిన సేవలు చేసినారు. మా అమ్మ ఆశ్రమం నిర్మాణం చేస్తే శ్రీ భీమయ్యగారు ఎంతో మంది సులక్షణ సంపన్నులను తీసుకొని వచ్చి శ్రీ దేవమాంబ గారి చేత ఉపదేశ మిప్పించేవారు. అద్భుతంగా వర్ణిస్తూ వ్రాసిన పాటలచేత అమ్మను ఆనంద పరచేవారు. ఉదా :- కృప జూడగ రావా జననీ-జననీ రాఘవరెడ్డి రాణివి నీవని నమ్మితి నిన్నూ నిత్యము నీకు సేవలు చేసెద ॥గావమ్మా॥ ముక్తికి మార్గము చూపమ్మా ॥కృప॥.

శ్రీ చెన్నస్వామి అయ్యగాను శ్రీ ఉపేంద్రయ్య మొ॥ ఎంతో మందికి ఉపదేశం ఇప్పించి వారిని కవులుగా గాయకులుగా, కళాకారులుగా, గురువులుగా తీర్చిదిద్దిన ఘనత భీమయ్యగారిదే. తర్వాత తానూ ఉపదేశాలు ఇస్తూ తనంత వారిగా తయారు చేసి సంప్రదాయానికి అందించిన పుణ్యపురుషుడు శ్రీ భీమయ్య గారు వీరి మండలారాధన సందర్భంగా నాశతకోటి వందనాలు సమర్పిస్తున్నాను.

బ్రహ్మానంద పి. జ్ఞానేశ్వరయ్య
మార్కండేయ వీధి, వరంగల్. సెల్ : 9393359356

## శ్రీ అచలగురు భీమయ్యగారి దర్శనం

- శ్రీ నిరసనానందాతీత నర్మెటి బుచ్చివీరయ్య



నేను నా 23వ ఏట దైవాన్వేణ కొరకై కడిపికొండలోని శ్రీ చంద్ర మౌళీశ్వర స్వామి. శ్రీ స్వామివారి సన్నిధిలో కూర్చుని 'శివయ్యా నాకెందుకింత బాధయ్యా'! అంటూ 'పూజలెన్ని చేసినా దయ రాదేలనయా ! పరమాత్మా కనరావదేలనయా ! కడిపికొండలో నివసించే నీ దాసు బుచ్చివీరయ్య మొర ఆలకించ వదేలనయా! అంటూ పాటలు రాసుకొని పాడుతూ ఎంతప్రయత్నించినా, ఎంత మొర పెట్టుకున్నా ఏ దారి దొరకలేదు ! అపుడు దైవాన్ని కనుగొనాలంటే వివేకం అనే చూపు కావాలి. ఆవివేకం ఎలావస్తుంది, జ్ఞానం వలన, ఆ జ్ఞానం ఎలా వస్తుంది, అది ఎవరి దగ్గర ఉందో వారి వల్లనె వాళ్ళు మనకు ఆ జ్ఞానం ఇస్తారా ? తప్పకుండ ! శ్రీ కృష్ణుడు ఆ చూపే ఇచ్చి అర్జునుడిలో ఉన్న విషాధాన్ని తొలగించి 'విశ్వరూప దర్శనం ఇచ్చి కార్యోన్ముఖున్ని చేసాడు. చూపులేకపోతే ఏమౌతుంది. అంధకారంలో తిరుగుతాం. జ్ఞానంలేకపోతే ఏమౌతుంది. దైవా న్వేషణకు దారి దొరకదు. అంటే, ఇంతేనా ఈ జీవితమంత పశుతుల్య జీవనం గడపవలసినదేనా. జన్మ-జన్మలు ఇలా అయిపోవలసినదేనా ! అని కన్నీరు మున్నీరు అయి తపించి తపించి తల్లడిల్లిపోతూంటే అపుడు దర్శనమైంది. ఎవరు ? భగవంతుడు కాదు, మానవరూపంలో ఉన్న మాగురుదేవులు, శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు.

1960న సంవత్సరములో శ్రీ భక్తానంద తూడిదేవమాంబ గారి వద్ద ఉపదేశము కొరకు మత్ గురుదేవులు మరియు మా చిన్న అన్నయ్య అయిన నరిమేటి రాజయ్య గారు రాత్రి పగలు అనకుండ పాపయ్య పల్లె, పాలంపేట, శివనగరు తిరుగుచూ... సేవచేస్తూ... ఆషాఢ శుద్ధ పౌర్ణమి రోజు అమ్మగారి కరుణకు పాత్రులై ఉపదేశము పొందినారు. ఆనాటి నుండి అనగా ! క్రోధినామ సంవత్సరము చైత్ర బహుళ పంచమి గురువారము (1964) రోజు వీరిరువురికి అదేరోజున శ్రీ దేవమాంబగారు..... మత్ గురుదేవులకు "నిర్మలానంద" అనే దీక్షిత నామంతో అధికార పత్రము ఇచ్చినారు. ఆనాటి నుండి శ్రీ గురుదేవులు పర్యటిస్తూ ఊరూరా తిరుగుచూ శమ, దమాదులకోర్చి శిష్య సంపదను సమకూర్చుకొంటూ మా ఊరు రావటము జరిగినది.

కడిపికొండలో పదిమంది భక్తులకు ఉపదేశము లిచ్చి జనన మరణ భ్రాంతి రహిత బోధపద్ధతినెరిగించి, భక్తమండలిని ఏర్పాటు చేసిరి, అట్టి మహానుభావుడైన మా గురుదేవులు శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల చరణధూళిని నేను శ్రీ నిరసనా నందాతీత నరిమేటి బుచ్చివీరయ్యను.

నాపై ఎనలేని కరుణతో "హస్తమస్తక సంయోగం"తో నన్ను కృతార్థున్ని చేసిన మత్ గురుదేవుల మండల ఆరాధన సందర్భంగా నా ఈ చిరువ్యాసం.

నిరసనానందాతీత నర్మెటి బుచ్చివీరయ్య
కడిపికొండ - వరంగల్లు. సెల్ : 9652027056

## సకల భ్రమలకు మూలము మూలములేని ఈ గుర్తెరిగే శరీరమే

- శ్రీ నిశ్చలానంద గీదా మోహన్ రెడ్డి



శ్రీమద్గురు దేవులైనటువంటి శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్య రాజయోగి గారి దర్శనము నాకు 1981 జనవరిలో జరిగినది.

అప్పుడు మా సోదరులైనటువంటి విర్గుణానంద తంగళ్ళపెల్లి రాజేంద్రార్య రాజయోగి గారు ఎంతో ఆప్యాయతగా నన్ను పలుకరించి అన్నయ్య మీరు ఈ బోధనలోకి రావాలి. గురు ధర్మము తెలుసుకోవాలి, అని నాకు చెప్పటం జరిగినది.ఆ పైన నా అడ్రసు తీసుకొని నా దగ్గరకు ఒక సంవత్సరము లోపు కాలినడకన 45 నుండి 50సార్లు రావటం. వచ్చినపుడల్ల ఎంతో ప్రాధేయపడుతూ అన్నయ మీరు ఉపదేశము పొందవలెనని మరి మరికోరటం జరిగింది. అప్పుడు నా రాజకీయ జీవితము దీనికి అంగీకరించలేదు! ఒక సంవత్సరము తరువాత అనగా 1982 కార్తీక పౌర్ణమి నాడు మద్గురు దేవుల వద్ద ధర్మము తెలుసుకోవడం జరిగినది.ఆ నాటి నుండి మా గురువుగారు నన్ను వెంటతీసుకొని ఎంతో మంది పెద్దల పరిచయము చేయనైనది. అందులో మా గురువుగారి సోదరులు, నా గురుసమానులు శ్రీభూమానంద, నల్లఉపేంద్రార్యులు, విద్యాపరంగా అందించినసేవలు మరువరానివి.అప్పటి సిద్ధాంతము లో చెప్పబడిన "పరిపూర్ణమును లేని యెరుక" అనేవాటి గురించి పరిశోధన కొనసాగించటం జరిగినది. ఈ పరిశోధన కాలము నాకు 10సంవత్సరములు పట్టినది. ఆ తరువాత వారి కరుణ వల్ల నేను లేని విధానమును తెలుసుకోవటం జరిగినది.కం॥ గురువర మీనా సందున, యెరుకను తెరగలిగి యుండె.యిన్నాల్లగొలెన్ కరుణారసేక్షణములన్, తెరదీసితిరెరుక. మాటతీరె నిక్కడికీ, చాలుబోధ దూరెదెక్కడికీ పరిపూర్ణమును లేని యెరుకాను జూపించి యెరుక లేదని యంత్రి యెరుకె లేదాయెను దీరేనిక్కడికీ చాలు బోధ దూరే దెక్కడికీ॥ పరిపూర్ణము ఎరుకల గురించి కొంత వివరణ

"పరిపూర్ణము అంతట కదలక మెదలక సూదికొన మోపుటకైన సందులేక యున్నది. పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప అన్యముగా భ్రాంతిరూపంగా తోచబడేదంతయు "యెరుకే" దీనికి కారణంలేదు- మూలం లేదు ! పుట్టనే లేదు. దీనికి ఏ నిర్ణయములు పనికిరావు.అందుకే "పరిపూర్ణపరబ్రహ్మము" శాశ్విత మని అచల సిద్ధాంత నిర్ణయము.పరిపూర్ణము నందు లేనిదైన యెరుక తనకు తానే అణుస్వరూపంగా తోచి స్వయం ప్రకాశరూపమైన శక్తిగా పరిణమించింది.

ఈ స్వయం ప్రకాశరూపమైన శక్తినే బ్రహ్మమని, ఆత్మయని, చైతన్యమని, యెరుకయని, శృతులయందు చెప్పబడుచున్నది. వస్తువుమాత్రము 'ఏకమే'. బ్రహ్మము(ఆత్మ) యెక్క చేతన సత్తాయే శక్తి. యిదే బ్రహ్మముయందు తొలుత జ్ఞానరూపంగా నున్న'తెలివి' ఈ తెలివే చలనాత్మకమై అనగా చలించి ప్రాణరూపం చెందును. ఈ ప్రాణము యింకను చలించినపుడు, శక్తి సంకల్పరూపంగా ఉత్పన్నమై సృష్టి రచనకు సమర్థవంత మగుచున్నది. శక్తి పదార్థము నందు సూక్ష్మముగా గుణరూపంగానో, తెలివి

రూపంగానో ఉన్నది. శక్తి చలన మున్నపుడే బహిర్గత మగుచున్నది, లేనప్పుడు బీజ రూపంగా ఉంటున్నది. "బ్రహ్మమే సృష్టికి కారణమని శృతులు పలుకుచున్నవి"

1శృతి॥"ఆత్మనా ఇదమేక ఏకాగ్ర అసీత్" ॥ఐతరేయ॥

తా॥ సృష్టికి పూర్వము ఆత్మ ఒకటే యుండెను. ఇతరము కొంచము కూడా ఏమి లేదు,'ఆత్మ లోకము లను సృజించ వలెనని చూచెను, లేక తలంచెను.

2శృతి॥"ఆత్మవు ఏకసన్ ఏతత్రయమ్॥ఛాందోగ్య॥

తా॥ ఆత్మయే ఏకైక సత్ పదార్థము. అది త్రివిధరూపంగానున్నది

3శృతి॥ మనఃప్రాణవాచా సంగాతం సత్తా॥చాందోగ్య॥

తా॥ మనఃప్రాణవాక్కుల మూటి సమిష్టియే సత్‌పదార్థమగు ఆత్మ పై శృతుల వల్ల ఆత్మ మనః, ప్రాణ, వాక్కులుగానుండినవని తేలినది.

1.ఆత్మ నేనేఈసర్వము కావలెనని సంకల్పించినపుడు ఆత్మకే"మనుసు" అని పేరు కలిగినది.

2.సకల కర్మలకు పదార్థరూపమగు ప్రాణ చలనమే కారణము గనుక కర్మ జరిగినపుడు ఆత్మకే"ప్రాణము" అని పేరు. అధిష్టాన చేతనత్వము అనే ఆత్మగాక యితర ఏ పద్ధతుల వలన కర్మ జరుగదు. సకల జీవోపాధికి కర్మయే కారణముగానున్నది.

3.సృష్టి పరిణామమున ఆత్మ యందు సూక్ష్మరూపంగా ఉండబడిన శబ్దతన్మాత్ర విజృంభించి అవకాశాంశ శబ్ద గుణాకారముగా పరిణమించినపుడు ఆత్మకే 'వాక్కు' అని పేరు.'వాగ్వైబ్రహ్మ' ఈ వాక్కు బ్రహ్మ స్వరూపమని శృతి పలుకుచున్నది. "ఆకాశం శరీరం బ్రహ్మ" బ్రహ్మముకు ఆకాశము శరీరంగానున్నది. ఈ ఆకాశమునే 'మాయ' అనిచెప్పబడును. 'మియతే అనేన యితిమాయ" అనగా ప్రతి వస్తువును ఒక మితిలో అనగ హద్దులో చూపునది మాయ. ఆత్మ నుండి వచ్చిన ఈ ఆకాశమునకు ఆత్మకారణముగాను సూక్ష్మముగా నున్నది. ఆత్మ దేహి, ఆకాశము దేహము, ఆత్మజ్ఞాన రూపము,ఆకాశము అజ్ఞాన రూపము.

మరుపురూపము బ్రహ్మము జ్ఞాన స్వరూమని తేలినదిగా !

1శృతి॥ జ్ఞాన దేవత్ కైవల్యం॥ తేజోబిందు॥

2శృతి॥ సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ॥ తైత్తరేయ॥

3శృతి॥ నిత్యం విజ్ఞానం ఆనందంబ్రహ్మ॥ బృహదారణ్యక॥

4శృతి॥ సత్వసంజాయతే జ్ఞానం ॥ కఠోపనిషత్తు॥

5శృతి॥ ప్రజ్ఞానం బ్రహ్మ॥ ఐతరేయ॥ అనువీ ఉపనిషత్తు వాక్యముల వలన బ్రహ్మము జ్ఞాన స్వరూపమని తేలినది. కావున అచల ఋషులు, జ్ఞానాజ్ఞానంబులు ఒక జ్ఞానంబువే, వేరు కావున కర్మ జ్ఞానములు రెండు విడదీయరాక అనగా బెల్లము నందుతీపి తీపినుండి బెల్లము రెండును విడదీయరాక యున్నట్లు జ్ఞాన కర్మలు విడదీయరానివై ప్రపంచముగా పరిణమించి సర్వ జగత్తును సృష్టించుటకుతానే కారణమైయున్నది. సృష్టించిన సమస్తమునందు తానే అణుస్వరూపంగా నుండి ఆయా జీవుల నామరూపములుగా ఉపాదుల నన్నింటిని నడిపించుచూతనయందు తానే భ్రమ గల్గియుంటు, తన సృష్టించిన వస్తువులచేత తానే ఆకర్షింపబడును. సమస్త భ్రాంతులకు కారణమగుచూ తానే కర్మ వాస్తవ బలము చేత తిరిగి అనేక జన్మలు పొందుచున్నది. ఈ విధంగా అనంతమగు ఒక విషవలయము ఏర్పడు చున్నది.సంస్కార రూపమైన జీవుడు ప్రళయకాలమున సమిష్టి తన రూపం యందే తమతమ సంచిత కర్మసంస్కారములతో అవిర్భావము చెందుచు ఇట్లు అనంత జన్మ పరంపరల యందు చిక్కుబడి సంసారమున పరిభ్రమించుచూనే యుండును. ఈ జనన మరణములు ఎవరికి గలుగుచున్నవి అనగా అధిష్టాన చేతన బ్రహ్మకు సత్యము దానిని మించి ఏమి లేదు. **తోచినజగత్తు మిథ్యా అని అనుకొన్నంతకాలము అట్టివారికి భ్రాంతి విస్తారమగునేగాని ఎన్నటికి జన్మ రహితముకాదు.** సకల భ్రమలకు మూలము ఈ మూలంలేని ఈ గుర్తెరిగే శరీరము కనుక దానికే సర్వభ్రాంతులు గలుగుచున్నవి. పరిపూర్ణ బోధవల్ల దీని రహిత విధానము తెలియునగును. నాచే రచింపబడిన ఇంకా వివరములకు **"అచలగ్రంథము, విచారించండి మాసిద్ధాంతము"** అను గ్రంధము ప్రింట్‌కున్నది. అందు పూర్తి వివరణగలదు.

నిశ్చలానంద గీదామోహన్ రెడ్డి
పో॥ భూపాల్‌పల్లి, జి॥ వరంగల్. ఫోన్ 9949709959

# కర్మ నిర్ణయం

- శ్రీ గురు కరుణానంద గీద లక్ష్మీదేవి



మద్గురు దేవులైనటువంటి నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్య రాజయోగి గారి వద్ద 1982 కార్తీక పౌర్ణమినాడు మా వారి నుండి నాకు పరిచయం కావటం అదే రోజు ఉపదేశం తీసుకోవటం జరిగినది.

అప్పటి నుండి గురు ధర్మములో నడుస్తూ ప్రబోధను వినడం జరిగినది. 13-11-2008న గురు కరుణానంద అను దీక్షానామం చేతనాకు అధికారం ఇవ్వడం జరిగినది.

నేను నా గురువు గారి వద్ద విన్న ప్రబోధ నా అనుభవమును కొంత జోడించి కొన్ని మాటలు ఇక్కడ చెప్పదలుచుకున్నాను.

**కర్మనిర్ణయము :-**

కర్మమున బుట్టు జంతువు కర్మమున వృద్ధి బొందు కర్మమున జెడున్। కర్మము జనులకు దైవము కర్మము సుఖ దుఃఖములకు కారణమధిప ॥

కర్మ మూడు విధములుగా చెప్పబడినది. ఏ విధమనగా జనన మరణ రహిత విధాము కోరునట్టి మానవుడు త్రికరణ శుద్ధిగానుండవలెను. త్రికరణ ములు అనగా మూడు. 1) మనస్సు, 2) వాక్కు, 3) శరీరములని చెప్పబడును. ఇట్టి త్రికరణముల ఏకైక రూపము సమిష్టి యందు పరమాత్మయని నిర్ణయము. కనుక వీటిని నియమితానుసారంగా ప్రవర్తింపజేసి నట్లైతే మలిన రహితమై పరమాత్మ రూపమునొందును. లేనియెడల మలిన రూపమునొంది పునర్జన్మకు కారణమగును.

ఏ విధమనగా 1) కాయమునొనర్చు కర్మ స్థూలకర్మ, 2) వాక్కుచే నొనర్చు కర్మ సూక్ష్మకర్మ 3) మనస్సు చేనొనర్చు కర్మ కారణ కర్మయని చెప్పబడును. ఇందులోనస్థూల,సూక్ష్మకర్మలు శరీరముతో నశించును.

కాని కారణ రూపకర్మ శరీరముతో నశించక విధేహముక్తిబొందువరకుండును. ఈ అధిష్టాన చేతనబ్రహ్మచే కారణ రూపకర్మగానున్నందున సహజావస్తగా యుండి శరీరమును, బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్య మరణంబులు క్రమముగా పొందించి తిరుగా మళ్ళి పుట్టించును. తాను చిరంజీవిగా బ్రతుకదలచుకొన్నను ఆత్మ బ్రతుకనీయక బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్య దశలు కలిగించును. ఇది ఆత్మయొక్క నిర్ణయముగా నున్నదని తెలియుచున్నది. ఈ చేతన శక్తియనే ఆత్మ పిండాండమునందు జీవ పరిణామము పొంది అవస్థాత్రయ రూపంబున కర్మానుభవమును అనుభ వించును. రాత్రింబవళ్ళను నిర్ణయము లేక ప్రాణ ధర్మము తన స్వరూపమగు కామవాంఛల అంతః కరణము నందు చేర్చి పునరావృత్తికి కారణమగు చున్నది. మరియు ప్రాణము యొక్క తటస్థ లక్షణమే మరణమని చెప్పబడును. ఈ మరణకాలమున దీని సమస్త వ్యవహారములు సంస్కారములై బీజమందలి అంకురము వలె నుండి దీని సమిష్టి అంతఃకరణము నందు, సమస్త జీవోపాధుల యొక్క కర్మవాసనము చేరుచుండును. తిరిగి ఏ జీవోపాధి కర్మ ఫలమును ఆ జీవోపాధికి కాలానుసారంగా చేర్చుచుండును. ఈ చేరిన కర్మ సంస్కారములు పునర్జన్మకు పునాది వేయుచున్నది. కనుక కర్మనుండి జన్మ, జన్మ నుండి కర్మయు కార్యకారణ రూపంగా జన్మ పరం పరలకు హేతుర్ భూతములైయున్నవి.

॥సర్వంసద్గురు చరణార విందార్పణమస్తు॥

**గురు కరుణానంద గీద లక్ష్మీదేవి**
పొ॥మం॥ భూపాలపల్లి, జి॥ వరంగల్.
ఫోన్ 8106329293

# నిజమైన జీవితం గడపడానికి గురువుల పాత్ర ప్రధానమైనది.

- శ్రీ పూర్ణానంద ఓరుగంటి బుచ్చిరామయ్య



శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయ కులు శ్రీ భక్తానంద తూడి దేవమాంబ రాజయోగిని గారి ప్రియశిష్యరత్న శిరో భూషణులు శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు పరమపదించినారని శ్రీ నిశ్కలానంద బండి చక్రపానార్యులు తేది : 16-08-13 శుక్రవారం రోజు తెల్లవారుజామున ఫోను చేసి తెలిపినారు. ఆ వార్త వినగానె అలా ఎట్ల జరిగినది అని మా కుటుంబ సపరివారముగా దుఃఖ సాగరములో మునిగితిమి. గురు బోధానుసారం స్థిమిత పడితిమి. ఆర్యులారా ! నాకు గురుదర్శనము లభించుటము నా పూర్వజన్మ సుకృత పుణ్య విశేషముగా భావించు కుంటున్నాను.

జన్మవచ్చినది మొదలు ఏదో అవ్యక్తమైన ఆరాటములు ఈ జీవితము పెనుతుఫానులో చిక్కుకొని ఆనేక కష్టములు పడుకుంటూ ఒక మధురమైన రుచి తరంగాలకై ఆబాల్యదశలో ఎదురుచూడడం శ్రీ వీర బ్రహ్మముగారి జీవిత చరిత్ర అను బుర్రకథ చెప్పుకుంటూ ఊరూరా తిరుగుతూ, ములుగు, వెంకటాపురం, చేరితిమి ! అక్కడ నిర్గుణానంద తంగల్లపల్లి రాజేందర్ అన్నయ్య ద్వారా గురుబోధ, పాటలు, పరిచయమేర్పడినది. తదుపరి మహ్మదాపురం లో బుర్రకథ చెప్పగా బలభక్తుల శంకరయ్య గారి గృహములో గురూపదేశం తీసుకోనైనది.

తేది : 27-09-1977 రోజున ఆరోజు నుండి గురుమూర్తి సేవలో జీవితం గడుపుతున్నాను. తనుమన ధనములు ధారపోసి, చతుర్విధ శుశ్రూషలు చేసి సాధన చతుష్ట సంపత్తులనెరిగి సాంఖ్యతారక అమనస్య పద్ధతులను తెలిసి మహావాక్య విచారణ జేసి, యెల్లప్పుడు సద్గురు సేవలోనే ఉంటున్నాము. ఈ సంసార బంధమనే భవసాగరము దాటుటకు అశరీరులై అనహంకారులై జనన మరణ ప్రవాహము నుండి బయటపడి నిజమైన జీవితం గడపటానికి గురువుల పాత్ర ప్రధానమైనది. అని తెలుసుకోనైనది ప్రతి మానవుడు శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయ గురువులను జేరి, జన్మజన్మల బంధములను విడచి తరించగలరని భావిస్తున్నాను. మా గురువు గారికి మండలారాధన సందర్భంలో నా మనస్సుమాంజలి..

పూర్ణానంద ఓరుగంటి బుచ్చిరామయ్య
గ్రా॥ & మం॥ తొర్రూరు, జి॥ వరంగల్. సెల్ :9908653435

# నన్ను కడతేర్చడానికి వచ్చిన అవతార పురుషుడు శ్రీ భీమయ్యగారు

- శ్రీ నిష్కలానంద బండి చక్రపాణి



అచలబోధ ప్రకారం అశరీరులైన మద్గురు తనువు చాలించిన వార్త నాకు 16-08-2013 ఉ॥ గం 3.30ని॥లకు తెలిసింది.

కుటుంబ సభ్యులమందరం దిగ్భ్రాంతి చెందినం. వారి కుమారులు కవలపిల్లలు శివుడు రాముడు వారి స్వగృహం పాలెంపేట నుండి ఈ వార్త అందించినారు. అప్పటి నుండి తెల్లవారు వరకు సాంప్రదాయకులైన పెద్దలకు నా సోదరులకు తదితర భక్త, కుల, బంధు మిత్రులందరికి ఫోన్ల ద్వార తెల్పి నా స్వగృహం నుండి రంగయ్యపల్లె నుండి పాలంపేటలోని నాగురు పార్థివ శరీర సందర్శనార్థమై పోయితిని, అక్కడ చేరిన వాళ్లతో సంప్రదింపులు జరిపి వారి కోరిక ప్రకారం పెద్దాపురం నిర్మలానంద ఆశ్రమానికి తరలించినాము.

సంప్రదాయకం ప్రకారం అలంకారాలు చేసి, పూజలు చేసి, రథంపై ఉంచి, అంతిమ యాత్ర సాగించినాము. ఎంతో మంది కడపటి దర్శనం చేసుకున్నారు. భజనలు చేస్తూ ప్రయాణం సాగించి నాము. అనేక గ్రామాలు మధ్య మధ్య ప్రజలందరు గురువు గారి దర్శనాలు చేస్తూ పెద్దాపురం చేరు కున్నాము. అక్కడ గ్రామం గ్రామమంతా కడపటి కన్నీళ్లు విడిచారు. ఈ ఊరేగింపు అద్భుతమని కొనియాడినారు. వందలాది మంది సుమారు వెయ్యిమంది సమక్షంలో ఆశ్రమంలో ఖననం చేయటం జరిగింది. నిత్యధూపదీప నైవేద్యాలతో గురుగీత పఠనం, భజనలు నిత్యం నిరంతరం సాగిస్తున్నాము. ఈ సందర్భంలో మా గురువు గారి సోదరులు మా గురు సమానులు శ్రీ ఉపేంద్రయ్యగారు ఎంతో సహక రించినారు. ఇప్పుడు 23, 24 సెప్టెంబరు 2013 నాటికి, మండలారాధనకు సిద్ధమౌతున్నాము. ప్రత్యేక సంచికతో సంప్రదాయక గురువులందరిని రావించి గౌరవించి మా గురువుతో వారికున్న అనుబంధాల గూర్చి సభలు జరిపించే కొరకు ముమ్మర ప్రయత్నాలు

సాగిస్తున్నాము. మద్గురుదేవుల దర్శనం ఉపదేశం, బోధ, అధ్యయన విధానం గురించి కొంచెం చెప్పాలనుకున్నాను. వివరంగా కాకుండా సంక్షిప్తంగా నాల్గు మాటలు 1984లో ఉపదేశం. అంతకు ముందు వారిని వారు నిర్వహించే కార్యక్రమంలో పాల్గొన్నాను. గురువుగారిపై భక్తి తాత్పర్యములు పెరిగి వారి పాదాలకాడ వ్రాలినాను. రామప్పగుళ్లో భజనలప్పుడు, రాజేందరన్నయ్య గ్రామం వెంకటాపురంలో మాగ్రమంలో వారు చేసే భజనలు ఉపన్యాసాలు వింటూ వారికి పరిచర్యలు చేస్తూ ఇట్లా ఈ 30సం॥లు గడిచినాయి. రాజేందరన్నయ్య మా సోదరులనందరి గురుని సేవించే విధానం గురువును పిలిపించుకొని పూజించే విధానం కట్నాలు, కానుకలు సమర్పించుకునే అంశాలను చక్కగా విడమరచి చెప్పేవారు. వారు పరమపదించినందున కల్గినలోటు తీర్చలేనిది. ఇప్పుడు నా సర్వస్వం నా ఇలవేల్పు నన్ను ఇహపరముల యందు అన్ని నిత్యనైమత్తిక కార్యములయందు తగిన శిక్షణ ఇచ్చి నాతో ఎన్నో కార్యక్రమాలు చేయించినారు. నేను చెప్పాలనుకున్న చాలా విషయాలను ఈ సంచికలో అభిప్రాయాలు పంపిన పెద్దలు ప్రస్తావించినందున మళ్లీ చెప్పటం చర్విత చర్వణం అవుతుంది. సంచిక పరిధి దాటు తుంది అని భావించినాను. నా భార్య రామలక్ష్మి నా పిల్లలు, బిడ్డలు, నాకొడుకు,కోడలు అల్లుండ్లు అందరు నా గురుసేవ చేసుకున్నారు. నా గురువు దగ్గర ఉన్న కళలన్నీ మా సోదరులు నేర్చుకున్నారు కాని, వారి నృత్యం ఎవ్వరు నేర్చుకోలేదు. వారి బోధ ప్రచారంలో ఈ జన్మను ధన్యం చేసుకుంటాను. లేనెరుక ఎన్నటికి లేదన్న భావముతో ఉంటాను.

ఈ “నిర్మలానంద స్మృత్యర్థ సంచిక”కు సంపాదక బాధ్యతలు స్వీకరించి సమయం తక్కువగా ఉన్నప్పటికి రాత్రింబవళ్లు ప్రెస్సులోనే ఉండి హోటల్లో తిండి ఇదంతా భరిస్తూ పనిచేస్తున్న మా గురువు గారి తర్వాత గురువంతటి వారు శ్రీ భూమానంద నల్ల ఉపేంద్రయ్యగారు వారికి మా ఆశ్రమం పక్షాన కార్యక్రమం పక్షాన మా సోదరుల పక్షాన ద్వాదశ నమస్కారాలు.

ఇంకా చెప్పవలసిన దాతలు, కార్యకర్తలు సోదర సోదరీమణులు ఎందరో అందరికీ కృతజ్ఞతలతో ఈ నాలుగు మాటలు ముగిస్తున్నాను.

**నిష్కలానంద బండి చక్రపాణి**
గ్రా॥ రంగయ్యపల్లె, మం॥ రేగొండ, జి॥ వరంగల్
సెల్ : 9951231943

## వినచెప్పికనచేసిన మహనీయుడు నాగురు భీమయార్యులు

**- శ్రీ భూమానంద బూర్గుల బాబురావు**



మునుముందుగా ఈ మార్గములో మమ్ములను నడిపించి గురూపదేశము ఇప్పించినట్టి మా అక్కయ్యయగు నాంపెల్లి మల్లీశ్వరీ లింగమడుగు పల్లి వారికి నేను చాలా ఋణపడి ఉన్నాను.

13-07-1984 ఆషాఢ శుద్ధ పౌర్ణమి రోజున పందికుంట గ్రామంలో శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల వద్ద ద్వాదశి శోడషి వాక్యములను ఉపదేశం తీసుకొని ఈ రోజు ఈ గురుస్థానము వరకు చేరుకోవటం నా జన్మ తరించినదని భావించుచున్నాను.

ఎందుకంటే ఈ విచారము ఎరికి సాధ్యంకాదు. తత్వ విచారపరులకు, యోగాభ్యాసపరులకు, అహంనే ప్రధానంగా చూచే సప్తకోటి మంత్రపరులకు మూలమైన తత్వమును నా మాతృభాషలో వినచేసి, కన చేసినటువంటి మహనీయులు మత్ గురుదేవులు శ్రీ నిర్మలానంద పిల్లమర్రి భీమయార్యుల వారు.

ఇతరులందరు శ్రీ కృష్ణుడు చెప్పిన భగవద్గీతను, దశావతారములను మాత్రమే చెప్పగలిగారు, రామాయణంలో నీతి ధర్మములను మాత్రమే చెప్పగలిగారు. నా గురుడు నీతికి, ధర్మమునకు మూలమైన దానిని చెప్పి చూపించగలిగినారు. పరిపూర్ణంలో లేని ఎరుక ఎన్నడూ లేదని దృఢపరచి కృతార్థున్ని చేసినారు. వారి మండలారాధన ప్రత్యేక సంచికకై ఈ రెండు మాటలు.

**భూమానంద బూర్గుల బాబురావు**
గ్రా॥ నందిగామ, మం॥ నల్లబెల్లి, జి॥ వరంగల్.
సెల్ : 9849605303

# గురు శుశ్రూష సేవా భాగ్యం

**- శ్రీ సమరసానందపోరెడ్డి రమణారెడ్డి**



శ్రీ శివరామదీక్షిత అచల గురు సాంప్రదాయక పారంపర్యులు అశరీర భీమయార్యుల వద్ద స్వస్తిశ్రీ ప్రజాపతి నామ సం॥ అధిక వైశాఖ శుద్ధ పౌర్ణమి మంగళవారము తేది : 28-05-1991 **రోజున** ఉపదేశముపొందినాను. శ్రీ నిర్గుణానంద తంగళ్ళపల్లి రాజేంద్రార్యులు శ్రీ నిష్కలానందబండి చక్రపాణార్యుల వారి సహకారంతో ఉపదేశము పొందినాను. అప్పటినుండి గురువుగారి దర్శనం దొరికినది. ఎప్పుడు గురువుగారు కలిసిన వారు ఇలా బోధించేవారు "నాలుగు శుశ్రూషలు లోలతగా వించుకొనుచు లోకాతీతం ఆలోకించి గురునిచె ఈ **లోకపు జోలివిడువు ఇంతెచాలన్న**" ఈ కందార్థమును **తీ**సుకుని చెప్పేవారు గురువుగారు చెప్పిన నాలుగు శుశ్రూషల గురించి కొంచెము వివరిస్తాను.

స్థానసేవ:-గురువు ఉండేటువంటి పరిసరాలను శుభ్రపరచడం ఆశ్రమము మరియు ఆస్థానమును పరిశుభ్రము చేసి గురుడు తిరిగే ప్రదేశాన్ని ఆనందంగా తీర్చిదిద్దాలి. ఇది స్థానసేవ.

అంగసేవ:- గురువుగారికి స్నానము చేయించడం శుభ్రమైన వస్త్రములను మరియు ధ్యానానికి పూజకు అనుకూలమైనటువంటి వస్తువుల సమకూర్చడం ఇది అంగసేవ.

భావసేవ:-గురువు బ్రహ్మ, విష్ణు, ఈశ్వరుడు, **తల్లి** తండ్రి దొర దాత వల్లభుడు బాంధవుడు ఆ భావ మాధుర్యాన్ని అనుభవించేటువంటిసేవ భావసేవ.

ఆత్మసేవ:- గురువుగారికి ఇష్టమైన పాలు ఫలహారములను ఏ సమయానికి ఏవి అవసరమో వాటిని సమకూర్చడం ఆత్మసేవ. ఇది బాహ్యాముగా చేసేటిసేవ. **"ఇక అంతరంగ సేవచేయాలి"**

స్థానసేవ:-గురువు మంత్రోపదేశము చేసినారు. ఈ శరీరమును గురువుకు అర్పణము. కావున హృదయము కామ, క్రోధ, లోభ, మోహ, రాగ, ద్వేష మద మాత్సర్యాలు లేకుండ తన హృదయము పరిశుభ్రముగా చేసినపుడు గురువుగారికి నిజమైన స్థానసేవ అవుతుంది.

అంగసేవ :-గురువుగారికి ధారపోసినటువంటి తనవును ప్రతిరోజు స్నానము చేయించడం పరిశుభ్రమైన వస్త్రములు కట్టుకోవడం మంచి ఆహారము భుజించడం గురువుగారిని ఎలా చూసినామో అలా ఈ శరీరమునకు సేవ చేయాలి. ఇది అంగసేవ.

భావసేవ :- గురువు చెప్పిన బోధను మరచి పోకుండ ఉండాలి. గురువు చెప్పిన బోధ కాకుండ ఎరుక చేష్టలు చేయకూడదు.

ఆత్మసేవ :- గురువు చెప్పిన బోధను నిర్ణయ పద్ధతిలో ఉండాలి. గురువు భ్రాంతి రహిత పద్ధతిని తెలిపినాడు. భ్రాంతి లేకుండ వుండాలి. ఇది ఆత్మసేవ.

**"ఇక నిర్ణయంగా శుశ్రూష ఎలా చేయాలి అన్నది. ఒక పద్ధతి"**

స్థానసేవ :- సాంఖ్యమును సాకల్యముగా నేర్చుకోవాలి.

అంగసేవ :- తారకమును బాగ నేర్చుకోవడం.

భావసేవ :- భావము అభావమై అమనస్కము నేర్చుకోవడం.

ఆత్మసేవ :- మహావాక్య విచారణ చేయడం.

ఇట్లా ఇన్ని రకములుగా బోధించిన మా సద్గురు మూర్తికి సదా శుశ్రూష పరుడనై జీవిస్తాను. దీక్షితీయం ప్రకారం నడుస్తాను.

**సమరసానంద పోరెడ్డి రమణారెడ్డి**
సే.స.జిల్లా అధ్యక్షులు
గ్రా॥ & మం॥ రేగొండ, జి॥ వరంగల్.
సెల్ : 9949200109

## బోధ దృఢం

- శ్రీ నిష్కల్మశానంద పోతరాజు చంద్రయ్య



నన్నునీవు నిన్నునేను గన్నవేలెట్టిదో. నన్ను నీవు వీడలేవు నిన్ను నేను వీడలేను. విడవకెప్పటికి నా ఆజ్ఞను గడువకెప్పటికి అని శ్రీ భాగవత కృష్ణప్రభు అన్నట్లుగా మా గురువు గారిని మొదటిసారిగా చూడగానే నా మనస్సుకు ఎంతో ఆనందము కలిగినది.

శ్రీ గీదమోహన్‌రెడ్డి గారి నుండి గురు ఉపదేశం గురించి తెలుసుకుంటిని, వారి ద్వారా పాలంపేటలోని శ్రీ నిర్మలానంద, పిల్లల మఱ్ఱి భీమయార్యుల దర్శనము నాకు కలిగినది. ఆయన యొక్క పాదదర్శనము నాకు 12-04-1988 రోజున జరిగినది. గురువు గారి దర్శనము కల్గిన నాటినుండి మాకు చెప్పినటువంటి బోధ మొదలచము నెరిగించెద విదితముగా లేని ఎరుక వివరింతుపయిన్ అని శ్రీ భాగవత కృష్ణ ప్రభువు అన్నట్లుగా, ఈ లేని ఎరుక గురించి శిష్యునికి 20 లక్షణాలు సాంఖ్యము తారకము అమనస్కము మహావాక్యములు వివరించి రానిది పోనిది బయలని లేనిది యీ ఎరుక అనుచు లెస్సగ దృఢమౌదానుక నీవీ మంత్రము మానక జపియించు చుండు మానీతిషాలీ లేనిదె లేదు మరువకీజోలి మాటలేనట్టి బయలున। మాట గలిగె ననుట వినుట మాయ గదయ్యా మాట మాయైతే మానెను। మాటను మాట్లాడి మనము మానుదమవలన్॥ మాటలేనట్టి బయలున ఒక మాట కలిగినదని, అట్టి మాటలను అనుచు ! వినుచుయుంటే అదియే "మాయ" యని తెలియును. కావున అట్టి మాట అను మాయను విచారించి, ఆ తర్వాత మనము మానుకుందామని శ్రీ మద్భగవత కృష్ణదేశిక ప్రభువులు తెలిపినారు.

శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు "సదసద్రహితం॥ అని కందార్థములో తెలిపినారు. దానికి మా గురువుగారు సరిపోయినారు. మా గురువు గారి మాటలు వింటే ఎవరికైన పరిపూర్ణమంటె ఏమిటో యెరుక అంటే ఏమిటో తెలుస్తుంది.

మా గురువుగారి వద్ద బోధవిన్న వారు సూచన ప్రాయంగా గ్రహించగలరు. ఎంతటి వారికైన చెప్పే అంతటి నేర్పుగలవారు. మా గురువుగారు కృష్ణ ప్రభు అన్నట్లు "సూటిగను బోధనామది నాటిదిక చాలు చాలు ననే వరకు చెప్పగలరు" ఆ ఘనత మా గురువుగారికే దక్కినది.

సదా సద్గురు సేవలో...

**శ్రీ నిష్కల్మశానంద పోతరాజు చంద్రయ్య**
గోదావరిఖని, జి॥ కరీంనగర్.
సెల్ : 9492203283

## శిష్యులను కడతేర్చాలనే మా గురుదేవుని తపన

- శ్రీ శాంతానంద వొల్లోజు సదానందాచారి, శ్రీమతి నలినీదేవి



శ్రీ నిర్మలానంద పిల్లలమఱ్రి భీమయార్యుల వారిని మొదట వారి బంధువుల ఇంట దర్శించడం జరిగింది. వారి మృదువైన వాక్కు, సరళమైన భాష, స్పష్టతతో భావాన్ని వెదజల్లె వారి పాటలు, నన్ను అమితంగా ఆకర్షింప చేసాయి. వారి దివ్యమైన మూర్తిత్వాన్ని జూసి, వీరు నిజంగా భక్తులను (శిష్యులను) ఉద్ధరించె అవతార పురుషులు అనిపించింది. వారి సన్నిధిలో కొంత సమయం గడిపిన తర్వాత వారి ప్రసంగాన్ని విని, వారిని కొన్ని ప్రశ్నలు అడుగాలనిపించింది. అంతకుముందు నాకున్నటు వంటి పురాణ, శాస్త్రజ్ఞానంచేత, అలా అనిపించింది. నేను మరణించిన తర్వాత ఎక్కడికి వెళతాను ? అసలు దేవుడు ఎక్కడ ఉన్నాడు ? అనే ప్రశ్నలు వారిని అడగడం జరిగింది.

దానికి గురుదేవులు, నాయనా ! నీవెవరో ముందు విచారించు, తదుపరి, దేవుడు, ఉన్నాడు, ఏలా వున్నాడు ? అసలు దేవుడెవరు అనే విషయాలు నీకు అర్థమౌతాయి. అని సమాధానమిచ్చారు. అత్యంత ఆసక్తితో వారి సమాధానాలు వివరంగా తెలుసు కోవాలని వారిని పదేపదే కోరడంతో నాకు ఉపదేశం

అనుగ్రహించినారు. ॥ఎరుకభ్రమ గల్గుశిష్యుని పరితాపము మాన్పి సంసార సాగరమనే నావను, జనన మరణ భ్రాంతినిరహిత పరిచే మార్గంలో నా గురుదేవులు చాలా నేర్పరులు. ఆయన సహనశీలి, వారిది దయార్ద్ర హృదయం, అచల ప్రబోధను ప్రచారం చేసే క్రమంలో వారు వారి జీవితాన్ని శిష్యులకోసం, త్యాగం చేసిన మహాను భావులు.

ఆయన శిష్య-ప్రశిష్యులను ఉద్ధరించటానికి ప్రతి క్షణం తపన పడేవారు. నిరంతర గురుపూజా కార్యక్రమములలో మునిగి తేలేవారు. ఏనాడు కూడా అలసి పోయేవారు కాదు.

వారు "అచల ప్రబోధ ప్రచార కేసరి" ఆయన శిష్య సమూహం చేత అందుకున్న సన్మానములు లెక్కలేనన్ని, మరుపురానివి. ఇంకా బయట ఎందరో మహాను భావులు సన్మానించినారు. "హృదయగంధి విడుచుటకై" ఎంతటి మందబుద్ధి గల శిష్యులకైనా - తన ప్రజ్ఞాపాటవం చేత బోధారూఢం చేయగల ప్రజ్ఞాశాలి మా గురుదేవులు. లౌకికంగా, ఆధ్యాత్మికంగా మాకు అండ, దండగా వుండి.. మా జీవితాల్లో వెలుగులు నింపి, పారమార్థికంగా మమ్మల్ని కృతార్థుల్ని చేసిన పుణ్యపురుషులు, వారిచ్చిన సంపదలు, సంసార వారధి దాటుటకు మార్గదర్శకములైనవి, మమ్మల్ని ఉద్ధరింపజేసిన మహాత్ములు వీరికివే మా ద్వాదశ దండప్రణామములు.

చాలా సుదూరంగా వున్న మారుమూల ప్రాంతమైన మా మహాముత్తారం అసలు, రాక-పోకలు సరిగా లేని రోజుల్లో, ఎన్నిసార్లు వచ్చారో. ఎంత శ్రమ పడ్డారో ! అయినా ఓర్చి శిష్యుల కడతేర్చాలనే - వారి తపన- అకుంఠిత దీక్ష చేత ఈ గ్రామంలో ఐదుగురు అధికార పురుషులకు అవకాశం వచ్చింది. ఇది వారి కృపాకరుణా కటాక్షములకు తార్కాణము. ఇట్లా మా గురువు గారి జీవిత విశేషముల గూర్చి బోధనా పద్ధతుల గురించి ఎంతైనా వ్రాయవచ్చు. కానీ సావనీరు పరిధిని దృష్టిలో పెట్టుకొని ముగించనైది.

**శాంతానంద వొల్వోజు సదానందాచారి, నలినీదేవి**
గ్రా॥ & మం॥ మహాముత్తారం, జి॥ కరీంనగర్.
సెల్ : 9908657342

## మా గురువు గారి ఆశయం అభివృద్ధికి తోడ్పడితే అంతే పదివేలు

- శ్రీ నిర్భయానంద మాడెం రాజబాబు-మంజుల



1984లో జన్మించినాను. 1989లో స్కూలుకు వెళ్లి 5వ తరగతి చదువుకున్నాను. 1994లో మా అన్నదమ్ములము భూములు పంచుకొని వేరు కాపురాలు పెట్టుకున్నాము.

ఇట్లా జరిగే జీవనయాత్రలో ఒక అద్భుతం. మా అక్క బావలు మహరాష్ట్రం నుంచి మా దగ్గరకు వచ్చి వ్యవసాయం చేసుకుంటు బతుకు తున్నారు. వాళ్లను చూడడానికి మా బావ అన్నయ్య చంద్రయ్య వచ్చినారు. వారి మాటలు వింటుంటె ఆశ్చర్యంగాను ఆనందం గాను ఉండెడిది. వారు గురుబోధల గురించి చెప్తుతుంటె నాకు వాటిపై ఆసక్తి జనించినది. గురువుకై నా మనస్సు పరితపించినది. అప్పుడు నా వయస్సు 10సం॥రాలు.

ఆ రోజుల్లోనే మా మహాముత్తారంలో పిల్లల మర్రి నాగభూషణం అనే వ్యక్తి మరణించెను. వీరు మా గురువుగారైన నిర్మలానంద పిల్లల మర్రి భీమయార్యుల వారికి చిన్ననాన్న.

నాగభూషంగారి అంతిమ యాత్ర అపూర్వ మైన రీతిలో సాగినది. ఆట పాటలచేత, రాగతాళ ధ్వనులచేత నాగురువుగారు ఆ అంతిమయాత్రను సాగించుట చూసి ఊరు ఊరంతా పరవశించినది. తెల్లవారి అనేక మంది ఉపదేశాలు స్వీకరించినారు. సుమారు 60, 70 మంది శిష్యులై మా గ్రామంలో అచలబోధను నేర్చుకున్నారు, అందులో నేను ఉపదేశం కాకముందే భద్రాద్రి రామశతకం పద్యాలన్నీ కంఠస్థం చేసినాను. కందార్థాలు 30-40 ఆనాడే చదివేవాడిని. నా శ్రద్ధాసక్తులను గమనించి మా గురువుగారు తేది : 21-09-2001లో ఉపదేశమిచ్చినారు. నేను నా భార్య మంజుల గురువు గారి పదసేవలో కాలం గడుపు

తున్నాము. అనేక ప్రాంతాలు తెలంగాణ, ఆంధ్ర, రాయలసీమలో సభలు సమావేశాలకు వెళ్ళాము. ఉపన్యసించటం జరుగుతుండగ శ్రీమత్ గురు దేవుల కటాక్షం కలిగింది. 16-08-2008లో శ్రీ భూమానంద నల్ల ఉపేంద్రార్యులు, శ్రీ నిష్కలానంద బండి చక్రపాణి మొ॥ పెద్దల సమక్షంలో నిర్భయానంద అను దీక్షా నామంలో అధికార పట్టానొసంగిరి మా గురువుగారు శ్రీ శివరామ దీక్షిత గురు పీఠ సాంప్రదాయమునకు చేసిన సేవలు మరువరానివి.

నేను కూడా వారి ఆజ్ఞప్రకారం రెండు మూడు రాష్ట్రాలలో శిష్యులకు ఈ బోధను అందించి ప్రచారం చేస్తున్నాను. ఈ సందర్భంలో గురువు ఎడబాటు, ఎన్నటికీ, ఎవ్వరికీ తీర్చలేని లోటు.

**"వారి ఆశయాలను ముందు తరానికి అందించి పరంపర అభివృద్ధికి తోడ్పడితే అంతే పదివేలు"** అని భావిస్తూ వారి చరణకమలములకడకు సమర్పణంగా ఈ నాల్గు మాటలు.

**నిర్భయానంద మాడెం రాజబాబు-మంజుల**
గ్రా॥ & మం॥ మహాముత్తారం, జి॥ కరీంనగర్.
సెల్ : 9948797312

## లలిత కళాకోవిదుడు శ్రీ భీమయ్యగారు

- శ్రీ నిత్యానంద పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, పద్మావతి



మద్గురు దేవులైన మరియు మా యొక్క పెద్దనాన్న గారు అయిన శ్రీమత్ శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల వారికి ద్వాదశ నమస్కారములు వీరియొక్క స్వగ్రామము నర్సపురం. తాలుక ములుగు. జిల్లా వరంగల్. వీరి యొక్క తల్లి తండ్రులయిన శ్రీ రాజలింగయ్య రాజమాంబలకు మూడవ సంతానమై జన్మించినారు భీమయ్యగారు. అయితే అసలు విషయం ఏమిటంటే మా యొక్క తాతలు మా యొక్క చిన్నాన్నలు పెద్దనాన్నలు అందరు కూడ నర్సపురంలోనే పుట్టినటువంటి వారు. వీరందరు కొద్ది రోజులు స్వగ్రామంలోనే ఉన్నటువంటి వారు. భీమయ్య గారు పదిహేను సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడే మాతృశ్రీ అమ్మగారైన శ్రీ భక్తానంద తూడి, దేవమాంబ గారి వద్ద ఉపదేశం పొందినటువంటి, ఘనత వీరిది. అయితే వీళ్ల నాన్నగారయిన రాజలింగయ్య గారు వద్దురా, వద్దురా, ఏమిపని పాట లేకుండ తిరుగు చున్నావు, అని తిట్టేవారట. అయిన కూడా ఎప్పుడో ఏ వేలనో ఏ రాత్రో ఏ పగలో ఎప్పుడు కాస్త టైం దొరకితే నాన్నలేని సమయంలో అమ్మగారి దగ్గరికి వెళ్లేవాడట ! పోయి ఆమెకు అనేక సేవలు చేసి ఎందరికో ఈ సంచిక సంపాదకులు నల్ల ఉపేంద్రయ్యను కూడా వీరే ఉపదేశం చేయించారట. అని ఇట్లా అనేక మందికి ఉపదేశాలు ఇప్పించిన ఘనత వీరిది. అయితే నర్సపురంలో ఉండగా వీరు, మరియు మా యొక్క నాన్నలు, చిన్నాన్నలు కూన లక్ష్మయ్య గారు, భీమయ్య గారు ఇంక వీరి బృందం అంత కలిసి, అద్భుతమైన నాటకాలు వేసేవారట ! మాయల మరాఠి విషాధ బాల నాగమ్మ ఆ నాటకంలో భీమయ్య గారు మాయల మరాఠి పాత్రతెచ్చి ఆపాత్రలో ఎంతోమంది కళ్లుచెమ్మగిల్లేటట్లు అద్భుతమైన పద్యాలు పాడి మాయలు, మంత్ర, తంత్రాలు చేసి వాహ్వా శభాష్ అనుకునేటట్లు చేసేవారట.

ఇది ఇలా ఉండగ కొద్ది రోజులకు భీమయ్య గారు, సోదరులు అంతకూడా పాలంపేటకు వెళ్లిపోయినారు. మా నాన్నగారు సాంబయ్య గారు మహాముత్తారం వచ్చినారు. అప్పటి నుంచి కొద్దిగ రాకపోకలు తక్కువయినాయి. మళ్లి భీమయ్య గారు ఎప్పుడు వచ్చారంటే మా తాతగారైన పిల్లల మర్రి నాగభూషణం గారు 1997లో పరమపదించినారు. అప్పుడు కబురు చేయగ వచ్చి మా తాతగారిని అంత్యక్రియలకు తీసుకెళ్లేటప్పుడు ఆయనను దేవుడిని ఊరేగింపు ఎలా చేస్తారో అలా స్నానం చేయించి కొత్త బట్టలు కట్టించి పూల మాలలు వేసి డోలక్ తాళ మేలాలతో పాటలు పాడుకుంటూ డ్యాన్సులు

చేసుకుంటు తీసుకపోతుంటే ముత్తారం గ్రామ ప్రజలకు ఆశ్చర్యం వేసి ఆయన ఎవరు అని - ఇంత అద్భుతంగ పాటలు పాడుతూ ఎగురుకుంటూ మహావైభవంగా చేస్తాండు అని అడుగ సాగారు. అప్పుడు, మా నాన్న చెప్పాడు. ఆయన మా అన్నయ్యనే మరియు గురువు గారు అని చెప్పారు. అంతలో దహన సంస్కారాలు అయిపోయాయి మల్లి దశదిన కర్మలకు వచ్చినప్పుడు మా నాన్న గారిని పిలిచి, సాంబన్న మీ దంపతులకు ఉపదేశం ఇస్తానని అనగ. వోల్వోజు సదానందం దంపతులు కూడా వచ్చి అయ్య మాకు కూడా ఉపదేశం ఇయ్యండి స్వామి. అనగ వారికి ఉపదేశం ఇవ్వటం జరిగింది. ఇలా భీమయ్య గారు మరి కొద్దిరోజులకు వచ్చినప్పుడు వెంకన్న, నాకేందుకో కోరిక పుట్టింది బిడ్డ, మీకు కూడ ఉపదేశం ఇస్తానని మాకు ఇచ్చాడు. ఇలా వస్తువుండగ మరికొద్ది మంది. మొత్తం 1999 వరకు 30 మంది సంఖ్య అయ్యింది. భీమయ్య గారు తరుచు రెండు నెలలకోసారి మా ఇంటి వద్ద రెండు, మూడు రోజులు ఉండి, అనేకంగ రాత్రింబవల్లు సాంఖ్య, తారకం, అమనస్కం, కందార్థాలు భద్రాద్రి పద్యాలు నోటికి. ఎరుక-పరిపూర్ణం తాత్పర్యం అనేకంగా చెప్పినారు.

మా కోసం ఎంతో కష్టపడ్డారు వీరిది మారు మూలగ్రామమని, వీరికి బోధ రావాలని వీరు కూడ సామాఖ్యలో కలిసి పోవాలని. ఎంతో తాపత్రయ పడ్డారు, కొద్ది రోజులకు సదానందాచారి అయిన మా సోదరుని శాంతానంద అని దీక్ష నామం ఇచ్చినారు. ఆ తర్వాత, 2004లో నన్ను పిలిచి దగ్గరకు తీసుకొని బిడ్డ నీవు కూడ కందార్థాలు భద్రాద్రి పద్యాలు బాగానే చదువుచున్నావు అని నాకు నిత్యానంద. అనే దీక్షనామం ఇచ్చి నన్ను తీర్చిదిద్ది కృతార్థునిగ చేసిన ఘనత ఆయనదే. అటువంటి మహాను భావుడు నేటి రోజున మరణించినాడంటే జీర్ణించుకోలేక పోతున్నాను. ఆయన దహన సంస్కరాల రోజున పెద్దాపురంలో ఎంతో బాధపడ్డాను. ఎందు కంటే ఆయనెక్కడికి పోతే అక్కడ ఆయన రూపం ఆయనపాట. ఆయన నడక, ఆయన బోధ ఆయన మాటలు, ఆయన తీపిజ్ఞాపకాలు మధురమైన మాటలు నాలోనే, నన్నెప్పుడు నా వెంటే నన్ను కదిలిస్తున్నాయి. నన్నెప్పుడు వెంకన్న వెంకన్న అన్న పిలుపు వినిపిస్తుంది. ఒక చివరి మాట ఏమిటంటే గురువు అంటే ఒక మార్గ దర్శకుడు అని ఉపదేశకుడని తరింప చేయు వాడని అర్థము. ఇంక, అష్ట విధాల గురువులలో అచలపరిపూర్ణ, గురుడే మిన్న. ఆయన గురించి ఎన్నిచెప్పిన తక్కువే కాబట్టి సమాప్తం.

నిత్యానంద పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, పద్మావతి

గ్రా॥, మం॥ మహాముత్తారం, జి॥ కరీంనగర్. సెల్ : 9948893230

## అచల ఋషి సాంప్రదాయ బోధలో అరుదైన మా గురుదేవులు

- శ్రీ సత్యానందాతీత కూనమల్ల సదానందయ్య



నిన్నునేను నన్ను నీవు కన్నవేల ఎట్టితో నిన్ను నేను మరువలేను. శ్రీ శివరామదీక్షిత అచలగురు సాంప్రదాయ శ్రీ భక్తానంద తూడి దేవమాంబ రాజయోగిని వారి ప్రియ శిష్యరత్నం మత్ గురుదేవులు. అచల తత్వ గానన్నత్యకళా కోవిదులు శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్య రాజయోగి గారిని మాకు పరిచయము చేసినవారు శ్రీ నిర్గుణానంద తంగళ్ళపల్లి రాజేంద్రార్య రాజయోగి అన్నయ్యగారు ! పట్టు పరిశ్రమ ఉద్యోగవృత్తి రీత్యా ఆత్మకూర్ మండలములో పెద్దాపురం గ్రామానికి 1986లో వచ్చి మాకు పట్టుమల్బరీ తోటను పెట్టించినారు. అప్పటినుండి పెద్దాపురం గ్రామములో హన్మాన్ మందిరములో భజనలు చేసేవారు. అప్పుడప్పుడు శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్య గురువు గారిని తీసుకొనివచ్చి శ్రీ పంచభూతాల రాజేశ్వర్‌రావు గారి ఇంట్లో ఉండేవారు. గ్రామములో ఉన్న భక్తులము మేము వెల్లి గురువుగారిని దర్శించుకొనె వారము. అలా మాకు గురువుగారితో పరిచయాలు అయినవి. 1989లో రాజేంద్రన్నయ్యగారు ఈ

పెద్దాపురం వరంగల్ సిటీకి 12 కి.మీ. దూరములో ఉన్నది. ఇక్కడ ఆశ్రమము కట్టాలి అని మాతో అనేవారు. ఇక్కడ శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులవారికి శిష్యురాలుగా కుమారి నాంపెల్లి మల్లీశ్వరి ఒక్కరె ఉండేవారు. మల్లీశ్వరి అంటే ఈ ప్రాంతంలో మంచి దైవస్వరూపులుగా పేరుండేది. ఆ తరువాత శ్రీ భూతాల తామాషరావు గారు. శ్రీ జిల్లపెల్లి మోహన్‌గారు, శ్రీ అన్నం కుమారస్వామి, శ్రీ కక్కెర్ల చంద్రమౌళి గారు, శ్రీ గోపిరెడ్డి కుమారస్వామి గారు, శ్రీ జిల్లపెల్లి వీరమల్లు గారు, శ్రీ కౌడగాని రాజేశ్వర్‌రావు గారు, శ్రీ సిద్ధోజు రామనాధాచారి గారు, శ్రీ గువ్వాటి సాంబయ్య గారు, శ్రీ దొమ్మాటి నర్సింగారావు గారు, శ్రీ డా॥ కందగట్ల వరధరాజులు గారు, శ్రీమతి లోకటి యాధబాయి, చెంచు ప్రభాకర్ ఆశ్రమ ఆస్థాన ఆర్టిస్ట్, మేము అందరము శ్రీ తంగళ్ళపల్లి రాజేంద్రన్నయ్య గారి కోరిక పై పెద్దాపురం గ్రామ పెద్దలు మరియు అప్పటి సర్పంచ్ శ్రీ జిల్లపెల్లి మోహన్‌గారి అందరి ఆశయము మేరకు పెద్దాపురంలో శ్రీ నిర్మలానంద ఆశ్రమము స్థలము గురించి శ్రీ పోలం మాధవరెడ్డి గారిని అడగగా వారు. 2-00 రెండు ఎకరముల భూమి దానం ఇచ్చినారు. కీ.శే. కందగట్ల లక్ష్మీనారాయణ జ్ఞాపకార్ధం వారి కుమారుడు వేణుగారు ఆశ్రమమునకు భూమి 0.04 గుంటలు రోడ్డుకు దానం చేసినారు. ఆ తరువాత శ్రీ నిర్మలానంద ఆశ్రమము శంఖుస్థాపన తేది : 03-02-1991న ఆదివారము రోజున జరిగినది. ఈ శంఖుస్థాపన పూజాకార్యక్రమము శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులు వారి శిష్యులు అందరి సహాయక సహకారములతో అతి వైభవముగా జరిగినది. ఆ తరువాత పెద్దాపురంలో తేది : 15-08-1991 నుండి అయిదు రోజులు శ్రీ నకాతి వీరన్నగారి ఇంట్లో వేదాంత క్లాసులు శ్రీ నేమాని వెంకట్రాం గారితో చేపియ్యడం జరిగినది. అప్పుడే ఈ గ్రామములో మేమందరము శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల వద్ద తేది : 21-08-1991వ రోజున ఉపదేశము అయినాము. అప్పటి నుండి మాకుటుంబము శ్రీ నిర్మలానంద పిల్లమర్రి భీమయార్యుల గురుదేవులతో చాలా సన్నిహితముగా ఉండేవారము. ఈ తనువు, ధనము, మనసు సర్వము వారిదేయని గురుదేవుల ఆజ్ఞకు బద్ధులమై ఉండేవారము. ఆ తరువాత శ్రీ నిర్మలానంద ఆశ్రమము తేది : 25-04-1999వ ఆదివారము రోజున శ్రీ అనుభవానంద స్వామి పి. వెంకటకృష్ణారెడ్డి గ్రా॥ చిల్లకూరు పూర్ణాశ్రమం అధ్యక్షులు జి॥ నెల్లూరు. గారిచే ప్రారంభోత్సవం చాలా వైభవముగా జరిగినది. ఆ తరువాత, తేది : 03-06-2000 నుండి తేది : 04-06-2000 వరకు రెండు రోజులు వేదాంత సప్తమ మహాసభలు జరిగినవి. దీనికి ముందు ఈ ఆశ్రమములో ఆశ్రమ వాసులుగా ఉండాలని మా గురుదేవుల ఆజ్ఞప్రకారము మరియు మా సహోదరులు అన్నయ్యల అందరి అభిప్రాయముతో పెద్దాపురం గ్రామములో ఉన్న గురుభక్తుల అందరి ఏకాభిప్రాయంతో తేది : 26-05-2000ల నుండి వారి మాటకు కట్టుబడి ఆశ్రమంలో ఆశ్రమవాసులుగా మా కుటుంబంతో సహా గురువులకు సేవ చేయుటకు ఆశ్రమ వాసులుగా ఉన్నాము, ఉంటున్నాము.

మా గురువుగారు మాతో ఈ వాక్యాలు చెప్పేవారు బిడ్డ నూటి మాటలకు కోటి మాటలకు ఒక్కటే. ఎప్పుడు నేను ఏమిలేని వాడను. సర్వము ఆ గురువు గారి అనుగ్రహము తప్ప ఏది నాది కాదు. ఇది నమ్ము. సత్యం. నేను అను అహంకారం తీసివేయుము. నేను అనుభావన ఎప్పుడు నీలో రానీయకు. ఈ ఉత్త బట్టబయలు ఏమిలేదు. ఇది నాకు మరువలేనిది. వాస్తవము అన్నారు. శ్రద్ధగా విని ఆచరణలో పెట్టిన నాకు అన్ని విధాల దారి చూపించి నడిపించిన మా గురువుగారిని మరువలేను. దుఃఖము వచ్చినప్పుడు-సంతోషము వచ్చినప్పుడు. ఈ రెండింటిని సమానముగా భావించు అన్నాడు. మా గురుదేవులు. బిడ్డ ఇక నీకుఏబాధలు ఉండవు అన్నాడు. ఇది నమ్మిన నాకు నా జీవితములో మార్పువచ్చినది. నా సోదరుడైన శ్రీ కూనమల్ల సాంబయ్య గారు. సి.ఆర్.పి.ఎఫ్. జవాన్‌గా ఉద్యోగ వృత్తిలో శ్రీనగర్ కాశ్మీర్‌లో తేది : 14-08-2000న బాంబు బ్లాస్టింగ్‌లో

మరణించినాడు. గురువు గారి శిష్యుడే ఆ సమయములో మా గురువుగారు మావెంట ఉండి బిడ్డ జననము మరణం సహజములే కదా అని బోధించేవారు. ఆ తరువాత మా తండ్రి శ్రీ కూనమల్ల వెంకటనర్సుగారు తేది : 02-09-2003వ రోజున పరమపదించినారు. గురువుగారికి శిష్యుడే నాకు మా గురువు గారు. బోధ అధికారము గురించి చెప్పి అధికారము ఇచ్చినారు. తేది : 27-05-2010న శ్రీ వికృతినామ సం॥ వైశాఖ శుద్ధ పౌర్ణమి గురువారము రోజున శ్రీ సత్యానంద అతీత అని బిరుదు ఇచ్చినారు. నా జీవితానికి తెరతీసినారు మా గురువుగారు. బిడ్డమీరు నన్ను ఇక్కడే పెద్దాపురంలో సమాధి చెయ్యాలి అని చెప్పేవారు. మా సహోదరులు అన్నయ్యలతో అందరితో అనేవారు. వారి మాట ప్రకారము మా గురువుగారు. తేది : 16-08-2013వ తెల్లవారు ఉ॥ గం॥ 3.30లకు శ్రావణ శుద్ధ దశమి శుక్రవారము రోజున పరమపదించినారు. వారి ఆశయముతోనే పెద్దాపురంలో సమాది చేయటము జరిగినది. ఎంతో వైభవముతో భజనతో మా గ్రామములో ప్రజలు ఆహా ఏమి యాత్ర ఎంతో వైభవోపేతముగా హాజరు అయి చూసినారు. ఇది మా పెద్దాపురం గ్రామములో ఏనాడు మరువలేనిది.


శ్రీ నిర్మలానంద ఆశ్రమ వాసులు

గ్రా॥ పెద్దాపురం, మం॥ ఆత్మకూర్, జి॥ వరంగల్.

సెల్ : 9704442307


## అచలతత్వ, గాన, నృత్య ప్రచార కోవిదులు భీమయ్య గారు

– శ్రీ పూజారి మనోహరస్వామి



నిరంజన, నిర్వికార, నిరంహకార, నిర్మల హృదయులు అ॥ప॥ శ్రీమతి ఉత్తరాంబ సమేత నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్య రాజయోగి అమృత మూర్తికి అశ్రునివాళి.

శ్రీవారి దర్శనభాగ్యం నాకు తేది : 08-10-1987న నా ప్రియ మిత్రుడు ఆత్మీయ సోదరుడు కీ॥శే॥ శ్రీ తంగళ్ళపల్లి రాజేందర్ గారి వలన కల్గింది. శ్రీ గురుదేవులు నన్ను కరుణామృత దృష్టిచేత నిండు సహృదయంతో ఆశీర్వదించారు. వారి ఆశీర్వాదబలం చాలాగొప్పది. నాలో నిద్రాణమై యున్న ఆధ్యాత్మికశక్తి నీ మేల్కొల్పింది. 1987 నుండి 95 వరకు వీరి వెంట వీరి శిష్య మండలితో కలిసి ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన దీక్షితీయ సంప్రదాయ వేదాంత సభలలో, గోష్ఠులలో మహాసభలలో పాల్గొనడం జరిగింది. గురు భక్తుడిగా నా సహకారం అందించడం జరిగింది. శ్రీ గురుదేవులతో నాకు ఆత్మీయ బంధం, సన్నిహిత సంబంధం ఉండేది. శ్రీ గురుదేవులు యోగ విద్యలో సిద్ధపురుషులు సంకల్పమంత్రం చేతనే నిర్వికల్పసమాధిని పొందేవారు. వీరు ఉపదేశం ఇచ్చే క్రమము, పద్ధతి ఆశ్చర్యకరముగా ఉంటుంది. ఈ పద్ధతి వేరొకచోట కానరాదు. వీరు ఈ యోగ రహస్యాన్ని తన 16వ యేటనే మాతృశ్రీ భక్తానంద తూడి దేవమాంబ రాజయోగిని ద్వార కఠోరమైన బ్రహ్మచర్య దీక్ష వహించి సాధించానని నాతో స్వయంగా చెప్పారు. ఈ విద్యను తన ప్రథమ శిష్యుడైన కడిపికొండ వాస్తవ్యులు శ్రీ బుచ్చివీరయ్య గారికి, మరికొంత మంది శిష్యులకు అందించారు. వరంగల్ జిల్లాలోని చాలా గ్రామాలలో వీరి శిష్యమండలలు వెలిశాయి. వీరి సంకల్పబలం కృషి ఫలితంగా పెద్దాపురం గ్రామంలో 5 ఎకరాల భూమిలో ఆశ్రమం ఏర్పాటైంది. వీరికి శిష్య ప్రశిష్యులు చాలామంది కలరు. పిల్లలమర్రి అనే వీరి ఇంటి పేరు వేదాంత పరంగా సార్థకమైంది. శివరామ దీక్షితీయ సంప్ర దాయంలో అచల తత్వగాన, నృత్య కళా కోవిదులుగా ప్రచారకులుగా వీరు సుప్రసిద్ధులు. “ వారికి సదా ఋణపడి ఉంటాను”


పూజారి మనోహరస్వామి, టీచర్,

శివనగర్, వరంగల్.

## ఉపదేశమిచ్చి విడిచిపెట్టడం మా గురుదేవుని లక్ష్యం కాదు !

- శ్రీ బోధానంద దాసివనమాల



శ్రీమత్ భక్తానంద తూడి దేవమాంబ గారి ప్రియ శిష్యరత్నం శ్రీమత్ నిర్మలానంద పిల్లలమర్రి భీమయ్యార్యుల వారి దివ్యదర్శనం 1984లో సోదరుడు భూమానంద బుర్గుల బాబు రావుగారి దయవల్ల కల్గింది. ఈ మూడు సంవత్సరాలు నాతండ్రి భీమయార్యుల బోధల వల్ల నా సుకృతం ఫలించి 1987లో ఉపదేశ భాగ్యం లభించింది.

నాగురుదేవుని కరుణ వల్ల అచల పరిపూర్ణ బోధతోపాటు నా లౌకిక జీవన స్థితిగతులు కూడా చక్కదిద్దుకోగలిగాను.

నా గురుకృప రాగమై, గేయమై, పద్యమై నాలో ప్రవేశించింది. నా గురుదేవుడు భీమయార్యుల వారు తీర్చిదిద్దిన వందలాది మంది శిష్యులలో 26 మందికి గుర్వాధికారం పట్టాలిచ్చి పరంపరాభివృద్ధికి తోడ్పడాలని ఆజ్ఞాపించినారు. అట్టి 26 మందిలో నాకు చోటు లభించటం నా అదృష్టమని భావిస్తున్నాను. 2010లో పెద్దాపురం ఆశ్రమంలో. బోధాధికారం లభించింది. నా గురువుగారు ఏ ఒక్కరిని ఉపదేశ మిచ్చి విడిచిపెట్టలేదు. హృదయ గ్రంథిని విడుచుటకై సదయత ఈ బోధదెల్ప జనదాగురుడై అన్న విధంగా భీమయార్యుల వారు నిరంతరం అహరహం కృషిచేసి 5, 6 రాష్ట్రాలల్లో పేరు ప్రఖ్యాతులు సంపాదించినారు. సమాఖ్య పరంగా మా గురువుగారు మా సోదరులు అందించిన సేవను దృష్టిలో పెట్టుకొని పెద్దలైన గురువులు మమ్ము ముందుకు నడిపిస్తారని నా గురువు మండలారాధన సందర్భంగా ఈ సంచికాముఖంగా కోరుతూ....

**బోధానంద దాసివనమాల**
గ్రా॥ నర్సాపురం, మం॥ ములుగు, జి॥ వరంగల్.
సెల్ : 9502659793

## భీమయ్య గారి గుణగణాలు ఎంత చెప్పినా తక్కువే !

- శ్రీ భక్తానంద వరిపెల్లి రంగమ్మ



భ్రమేణాహం భ్రమేణత్వం ప్రభమేణోపాసకాజనాః భ్రమేణేశ్వర భావత్వం భ్రమ మూల మిదం జగత్

భ్రాంతిచేతనే నేనును, నీవును భ్రాంతిచేతనే ఈశ్వరోపాసన జేయునట్టి జనులును భ్రాంతిచేతనే ఈశ్వరభావమును గలుగుచున్నది. ఈ జాగ్రత్త భ్రాంతివల్లనే యున్నది గాని నిజముగా లేదని భావము. నూటికి - కోటికి ఒకటే మాట బిడ్డ. ఇది అంతము లేనిది. లేనిది. ఇది అంతయు అబద్ధం. అని లేనిది ఉన్నట్లుగాను భ్రమ చేతనే సర్వం భ్రమింపబడుతుంది అని మా గురువర్యులు బోధించారు. మా గురువును మొదటగా మా చిన్నన్నయ్య యగు మునికుమార్ ద్వారా పరిచయం అయ్యారు. మా చిన్నఅన్నయ్య వివాహ సమయంలో నేను నా భర్తయగు నాగయ్యగారు భీమయార్యుల వారి దగ్గర ఉపదేశం తీసుకున్నాము. కాలానుగుణంగా వచ్చే కష్టాలు ఎన్నివచ్చిన ఆ తండ్రి రాకచేతనే తొలగిపోయేవి మాకు ఎంతో స్ఫూర్తినిచ్చేది ఆ తండ్రిని వర్ణించుట ఎవరి తరము కాదు. ఎంత చెప్పినా తక్కువే. కం : పిల్లలు తాట్యాకులతో పిల్లల గావించి పెండ్లి పేరంటంబుల్ కొల్లలుగజేయవారల తల్లులుగని సత్యమనుచు-తలచేరా మదినీ-నిను నీవిట్లు దలచరా మదిని-కల్లా సంసారముగని మానవులు సంత సిల్లాగ గురు మంత్ర సిద్ధాలు నిజమాని తలచేరా మదినీ - నిను నీవిట్లు దలచేరా మదినీ. పిల్లలు ఆటలాడుకొను సమయంలో మట్టితో, రాయితో గూడిన ఆడబొమ్మలను, మగబొమ్మలను చేసుకొని పాత గుడ్డలు చీల్చి చీరలు దోవతలు కట్టబెట్టి పెండ్లిండ్లు, పేరంటంబులు, ఊరేగింపులు చేయుచు అందులో నొకరినొకరు కలహములు పెట్టుకొని. పోట్లాడుకొనుచుందురు ఆ పోట్లాటలను చూచుచున్న పెద్దలైన తల్లిదండ్రులు నవ్వుకొనుచు వారికి తెలియక పిల్లచేష్టలు చేయుచున్నారని అది నిజం కాదని దలచుచుందురు. అందువలన నీవుగాని నీతోగూడిన ప్రపంచముగాని సత్యమని నమ్మియుండకుము అని మా గురుదేవులు చెప్పినారు. వారి తలంపులో జీవిస్తాను, ఎరుకలేక సేవిస్తాను.

సర్వం సద్గురు చరణార విందార్పనమస్తు.

**భక్తానంద వరిపెల్లి రంగమ్మ**
జూలైవాడ, మం॥ హన్మకొండ, జి॥ వరంగల్. సెల్ : 9676685878

## గురుదర్శనం జీవితానికే వెలుగు

- శ్రీ సిరిమల్ల సుభద్ర



శ్రీమద్గురుమూర్తి శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల వారి దివ్యపాదారవిందములకు శత సహస్ర కుసుమాంజలులు.

నా గురుదర్శనం అయిన క్షణములో తెలిసింది. ఇంతవరకు నేను జీవించింది ఈ చీకట్లో నా ? అని, చావు పుట్టుకలంటే తెలియక అజ్ఞానపు చీకట్లో అలమటిస్తున్న నాకు నా అచల గురుదేవుడు భీమయ్య గారి దర్శనమయ్యింది. తేది : 28-07-1998. ఏమి లేని దాంట్లో ఏభయభ్రాంతులు లేవని అన్నాడు. బయలని అన్నాడు, సమస్త భయభ్రాంతులకు మూలమైన ఎరుకకు మూలము లేదని అన్నాడు. ఎండమావులవంటి సమస్త జగత్తులో నువ్వు ఎవరో తెలిస్తే చాలన్నాడు. అందుకు బోధను ప్రారంభించారు. పీఠ గ్రంథాలసారాన్ని విప్పి విడమరచి చెప్పిండు. వారికి సేవలు చేశాను. అందువల్ల నేనూ నా భర్త పిల్లలు అంతా హాయిగా ఆనందంగా ఉన్నాము.

నా తండ్రికి, ప్రభువుకు వందలాది మంది శిష్యులున్నారు. అందర్నీ క్షణ క్షణం జాగ్రత్తపరచి ఎరుక భ్రాంతి నుండి విముక్తి చేసిండు. అందువల్ల అంతా వెలుగైంది. నా తండ్రి మరణకాలంలో, నా అన్న సరిహద్దుల్లో వీరజవాను వీరమరణం పొందినప్పుడు ఎన్నో రోజులు మాతో గడిపి దుఃఖ నివృత్తి విధానాన్ని బోధపరచిండు, మొన్న తేది : 07-08-2013 నాడు చివరి దర్శనం, అన్ని సేవలు చేసి ఆనందింప చేసినాము. అయ్యా ! మళ్లీ మీ పునర్దర్శనం ఎప్పుడు నాయనా అని ప్రార్థించగా, మళ్లీ నా ? ఇక కుదరదు అని అన్నాడు. ఆ పలుకులు మాకు సాధారణముగా అంటున్న వాక్కులని అనుకున్నాము, కాని వారం తిరక్కముందే, తేది : 16-08-2013 నాటి మరణవార్త. తట్టుకోలేకపోయినాము నా భర్త నర్సయ్యగారు నా పిల్లలం బోరున ఏడ్చినాము. అయినా మరణం అనేది సహజమైనదని వారి బోధలు జ్ఞప్తికి చేసుకొని నిబ్బరంగా ఉండే ప్రయత్నం చేస్తున్నాము. గురు స్మరణలోనే ఉంటున్నాము, ఉంటాము. జైగురు.

సిరిమల్ల సుభద్ర
గ్రా॥ జూలైవాడ, హన్మకొండ. సెల్ : 9603250033

## జ్ఞానమనెడి తెప్పచే తీరముకు చేర్చు నావికుడే భీమయార్యుల వారు

- శ్రీ కొలిపాక విజయనిర్మల



శ్లో॥ నిధయే సర్వవిద్యానాం-భిషజే భవరోగిణాంగురవే సర్వలోకానాం-దక్షిణామూర్తయే నమః

అందరికి గురువు, భవరోగానికి వైద్యుడు, అన్ని విద్యలకు నిధి అయిన దక్షిణామూర్తికి నమస్కారములు మామూలు రోగాలకు, మానవ వైద్యులుంటారు. పుట్టుక, చావు రోగాలకి మాత్రం వైద్యుడు ఆ సద్గురువే !

అన్ని జన్మల కంటే ఉత్తమమైనది మానవ జన్మ. నిర్మలానంద భీమయ్యగారి వంటి గురువు లభించటం నా తల్లిదండ్రుల నుండి వచ్చిన పుణ్యఫలం. ఏ తల్లిదండ్రులైన కాలానుగుణంగా తరిగిపోయే సిరిసంపదలను ఇవ్వగలరు. కానీ నా తల్లిదండ్రులు ఎనలేని (వెలకట్టలేని) సంపద నిచ్చే ఆ సద్గురు మూర్తిని నాకు ప్రసాదించారు. మా త్రండిగారు చనిపోయిన తర్వాత దశదినకర్మ జరిగిన మరుసటి రోజు మా తల్లిగారైన పద్మావతిగారు గురువుగారికి అమ్మగారికి పట్టువస్త్రములు సమర్పించిన సందర్భము లోనాకు ఉపదేశమిచ్చారు. జనన-మరణభ్రాంతి రహిత మార్గమే సరియైన మార్గమని తెలియజేశారు.

“మళ్ళీపుట్టడం-మళ్ళీ చావడం మళ్ళీ మళ్ళీ తల్లి గర్భంలో పడటం. ఈ చావుపుట్టుకల సంసారాన్ని దాటడం సాధ్యంకాని సమయంలో మా గురుదేవుల ప్రత్యక్ష వాత్సల్యానికి నోచుకున్నాను. గురుదేవుని పాదాలు చేరుకున్నాను. మా గురువుదేవులు క్షమా గుణము కలవారు. అపరాధికి కూడా అభయమును ఇచ్చువారు. సర్వకాల సర్వావస్థలందును సంతుష్టులై యుండువారు. ఏ మాత్రము కాంక్షలేనివారు.

జ్ఞానమనెడి తెప్పచే తీరమునకు జేర్చు నావికుడే నా గురుదేవుడు“పుష్పము సుంగధమును వెదజల్లునట్లుగా”

మా గురువుగారు నిత్యసంతుష్టుడు. నిత్యము తన ముఖారవిందమున నవ్వుతూ కనిపించేవారు. సహజానందము కలవారు. ఆనంద స్వరూపులు ఆ పరాత్పరున్ని ఎంతగా కొనియాడిన ఇంకను మిగిలియే యుండును. తనను వర్ణించుట ఎవరి తరంగాదు. మా యొక్క భవబంధాలను తొలగించటానికి అవతరించిన భగవత్ స్వరూపులు మా గురుమూర్తి భీమయార్యులవారు.

"సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు"

కొలిపాక విజయనిర్మల
జూలైవాడ, హన్మకొండ, సెల్ : 9291553892

## అశరీర సంప్రదాయ ప్రదాత

- శ్రీ బూర్గుల నిర్మల



దుర్లభం మానుషం దేహం.....
....అను శృతిని అనుసరించినా? శాస్త్రపద్ధతిలో పరిశీలించినా ! 84 లక్షల జన్మములలో ఏ జన్మ కాకుండా మానవ జన్మకు రావడం నా యొక్క జన్మసార్ధకమైనదని భావించు చున్నాను ! ఏమి తెలియని చిన్నవయస్సు దాదాపు 16సం॥లకు శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల దర్శన భాగ్యము కలిగినది. 13-07-1984 ఆషాఢ శు॥ పౌర్ణమి రోజున. అదే రోజు ద్వాదశి, షోడశ, వాక్యములను పందికుంట గ్రామంలో మాకు ఇవ్వడం జరిగింది. సృష్టిలోని సకల సంపదలకన్నా మించిన భాగ్యము నాస్వంత మౌట నాజన్మ తరించినదిగా భావించుచున్నాను.

"గురుచరణ జలము గోదావరి అని గురుమూర్తి రామభద్రుండని తత్పురము భద్రాచలమని గురుమంత్రమె తారక మని గురిగలిగినట్టి తిరిగిరాని మరుగెరిగినట్టి" అన్నట్లు శ్రీ భాగవతుల కృష్ణ ప్రభువుల కందార్థ అనుభవార్థము గడిచిన 30సం॥లుగ సేవించినాను. ఇప్పుడు అయ్యా మీరు పరిచయం చేసిన గురు, బంధువులయొక్క ప్రేమానురాగములు తులలేని భాగవతుల వారి జ్ఞాన భావ వీచికలు బూర్గుల వారి ఇంటికి స్వంతం కావటం మా అదృష్టం. ప్రపంచంలో సామాన్యులకు తెలియని అశరీర పద్ధతినిచ్చిన మహానుభావుడు నాగురుడు భీమయార్యులు. మీకిదే నా హృదయపూర్వక ద్వాదశ శ్రద్ధాంజలి సమర్పిస్తున్నాను.

బూర్గుల నిర్మల
గ్రా॥ నందిగామ, మం॥ నల్లబెల్లి, జి॥ వరంగల్.

## గురుదయ ఉన్నది.

- శ్రీ గూడెల్లి దేవేందర్



ఈ సృష్టిలో ఎనుబది నాల్గులక్షల జీవ జంతువులలో మానవ జన్మ శ్రేష్టమైనదనియు తరించుటకు అవకాశమిచ్చునది ఇందుకు సులభమైన మార్గము "గురు" మార్గమే.

ఉత్తమమైనదని తలంచి గురు పాద, పద్మం బులను చేరితిని నాకు జనన, మరణ రహిత మైనటువంటి బోధను తెలిపి తరింప జేసినటువంటి పూజ్య గురువులు మా ఆరాధ్యా దైవ స్వరూపులు భీమయ్యగారు.

గురుడే బ్రహ్మ, గురుడే విష్ణువు
గురుదేవులే మహేశ్వరులు గురువే సర్వమనియు
గురుని నరునిగా ఎంచ్చక అన్నింటిలోకెల్ల
అందరిలోకెల్ల ఉత్తమొత్తమమైన వారు మా సద్గురు

కం॥ జనులార జననమరణము-లనుదొలగన్
దోయజాలు-లక్షణయుతమై-వినువారికి-కనువారికి
తనలావెరించుదీని-తప్పాక వింటే-అప్పుడెవార
లెప్పుడుగంటే-కనుకా వినుబుద్దైతెవినుడీ
చదివెద-మీకె-కనుగొనమనసైతె-కనుడీ
పుస్తకమంతా-తప్పాకవింటే-అప్పుడెమీరలెప్పుడుగంటే

తా॥ ఈ జనన-మరణ కాల చక్రములోపడి దారి యెచటనో తెలియక దుఃఖించుచున్న మానవులకు వారి బాధలను తీర్చి, "నే" లేనటువంటి చదువును (బోధను) నేర్పి ధన్యులను జేసి నటువంటి పరిపూర్ణులు. మా గురుదేవులు. స్థిరమైనది చలనములేనిది. పరిపూర్ణ మనియు చలనముతో కూడియున్నది. యెరుకయ నియు తెలిపినారు. సద్గురుయొక్క కృపచేతనే నిత్యమైన పరిపూర్ణమును అనిత్యమైన యెరుకను తెలిసికొన్నాను. గాన వారి మండలారాధన సందర్భమున ద్వాదశ నమస్కారాలు.

"సర్వం సద్గురు చరణార విందార్పనమస్తు"

గూడెల్లి దేవేందర్
జూలైవాడ, హన్మకొండ.
సెల్ : 9849033279

## ఈ బోధ తప్పనిసరి కావాలె

- శ్రీ నర్ర సుగుణమ్మ



10-04-1982లో శ్రీ తంగెల్లపల్లి రాజేందర్ అన్నయ్య కృపవల్ల నాకు బోధ గురించి చెప్పినారు. పంది కుంట మా గ్రామములో ప్రతి శనివారం సత్సంగము పెట్టి చాలమందికి భీమయార్యుల గురించి వారి యొక్క ప్రతిభవారి గురువుగారైన దేవమాంబగారి గురించి మరియు ఈ జనన, మరణ ప్రవాహము గురించి చెప్పటం జరిగింది. ఆ విషయాలు విన్న తరువాత ఎన్ని పూజలు చేసిన ఈ జనన మరణములు తప్పవు కావున ఈ ప్రబోధ తప్పని సరిగా కావాలి. అని అన్నయ్యతో ప్రతివారం వెళ్ళి అంజనేయ స్వామి గుడిలో 10మందిమి కలుసుకొని మాకు ఉపదేశం యిప్పించమని చాలాసార్లు అడిగినాము.

నా పూర్వజన్మ పుణ్యము వలన అన్నయ్య తేది : 28-05-1983లో గురువు గారిని తీసుకొని మా గ్రామములో పూజపెట్టించి ఉపదేశం యిప్పించినారు. నిత్యనిరాకార, నిరుప్రదవాఖండ, నిర్మల, నిర్గుణ, నిష్కలంక, నిష్కర్మ, నిష్క్రియ, నిస్సంగ, నిర్ద్వంద్వ నిరుపమ నీరంధ్ర నిర్వికల్ప, నిర్విశేషా చింత్య నిరతిశయానందా, స్వస్వరూపంబు, నిస్సంశయముగా వారి జాసన కైలసవాస, వాసవాదులకైన వర్ణింప నలవిగాదు రమ్యగుణధామ భద్రాద్రిరామ పరుశురామ నర్సింహదాస సంరక్షితాహ్వ.. ఏ ఆకారములేనివాడ, ఏ ఉపద్రవము లేనివాడ, నిర్మలుడు, ఏగుణములు లేనివారు, ఏకర్మలులేనివారు, క్రియలులేనివారు, ఏ సంగము లేనివారు, ద్వంద్వములేనివారు, ఏ స్వరూపలేనివారు, ఆ సద్గురు పరిపూర్ణులను ఆ త్రిమూర్తులు కూడా వర్ణించలేరు. అయ్యా మీకు నా పదివేల వందనాలు.

నర్రా సుగుణమ్మ
గ్రా॥ పందికుంట, మం॥ ములుగు, జి॥ వరంగల్.
సెల్ : 9848785024

## అచలబోధతో భ్రాంతిరహితం

- శ్రీ పెరుగు లింగమూర్తి



నాకు ఈ పరిపూర్ణ బోధ పరిచయం కావడానికి కారణం భీమయార్యులే! నాకు తొలి దర్శనం 13-09-2003 రోజున భూపాలపల్లిలో నన్నుచూసి పలకరించి పేరు ఊరు అన్నీ అడిగారు ! తర్వాత పరకాలలో కలిసి రాజేంద్రార్యులు మండలారాధన పూజ పత్రిక ఇచ్చి పూజకు రమ్మన్నారు. నేను పోలేకపోయాను ! మళ్లీ నాకు కూనమల్ల సదయ్యగారి నాన్న పూజ పత్రిక పంపించారు. పత్రిక చదివి ఉ॥గం॥ 5ల వరకు పూజకు వెళ్లి సాయంత్రమంతా అక్కడే ఉన్నాను. ఆరోజు నా జీవితంలో మరచిపోలేని రోజు. ఎందుకంటే ఆ రోజంతా ఒక్కక్షణంలా గడిచింది. ఈ బోధ నాకోసమే పుట్టింది. వీరంతా నా వాళ్ళు, నేను ఇన్నేళ్లు వెదికేది, తపించేది దీనికొరకే, అని ఆనంద సాగరంలో మునిగితేలాను. అదే రోజు గన్‌రెడ్డి రవీందర్‌రెడ్డి గారు పరిచయం చేసుకొని బోధగురించి చెప్పి రక్తసంబంధంకన్నా, స్నేహ సంబంధంకన్నా, ఆత్మ సంబంధం చాలా గొప్పది అని బోధ విషయాలు చాలా చెప్పారు. అదేరోజు మా గురువుగారు సమరసానందపోరెడ్డి రమణారెడ్డ్యార్యుల పరిచయం చేశారు. అప్పటినుండి ప్రతిగురు కార్యక్రమానికి తప్పకుండా వెళ్లే వాన్ని. ఉపదేశం ఇవ్వండయ్యా ! అని భీమయ్య గార్ని అడిగితే ఇప్పుడే ఎందుకు అని రెండు సంవత్సరాలు జరిపినారు. నేను పెద్దమనిషిని ఎప్పుడు ఏమి జరుగునో నీవు విద్యబాగా నేర్చుకోవాలె అని, నేను చెప్పిన వారి వద్ద ఉపదేశం తీసుకోవాలెనని ఒప్పించి నన్ను శ్రీరమణారెడ్డిగారి వద్దకు చేర్పించారు ! నేను ఈ రోజు ఇలా ఉన్నానంటే అందుకు కారణం భీమయార్యులే ! నేను దేవుళ్లనీ, గుళ్లనీ తిరిగేవాణ్ణి ! ప్రతి సం॥ వినాయకున్ని పెట్టేవాణ్ణి, అయ్యప్పమాల వేసేవాణ్ణి, చినజియ్యర్ స్వామి గణపతి సచ్చిదానంద, సాయిబాబా భక్తులు నన్ను చాలా సభాకార్యక్రమాలకు తీసుకు పోయేవారు, కాని నాకు నచ్చక పోయేది. నాకు దైవభ్రాంతిని విడిపించినారు.

లోక, శాస్త్ర, దేహ, వాసనల గురించి వివరించినారు. నాకు కుల భ్రాంతి, రాజకీయ భ్రాంతి ఉండేది. గురుడు అష్టమదాల గురించి అష్టపాశాల గురించి, అరిషట్ వర్గాల గురించి, ఈ షణత్రయ, తాపత్రయాదుల గురించి చెప్పుకుంటూ నన్ను, భ్రాంతిలో నుండి విడిపించినారు.

నేను ఈ రోజు నలభైలక్షల ఇల్లు కట్టానంటే అందుకు కారణం గురుకృపవల్లనే ! మా యింటికి నేనే ముగ్గుపోసుకునేల చేశారు ! మా చెల్లిపెండ్లి ముహూర్తం కూడా తానే నిర్ణయించినారు ! మనకు అనుకూలమైన రోజే మంచిరోజని అందరిని మెప్పించి వైభవంగా పెండ్లి జరిపించినారు. మా ఇంటికి నెలకు రెండుసార్లు వచ్చేవారు. వారి యింటికి నెలకు రెండు మూడు సార్లు పోయేవాడిని. రాత్రుల్లంతా బోధలు, శ్లోకాలు, పద్యాలు, కందం, కందార్థాలు గురించి, ప్రపంచం గురించి, పారమార్థికం గురించి చాలా విషయాలు చెప్పేవారు. మా గురువు గారు అన్నారు. లింగమూర్తి ! ఎవరు ఏమనుకున్నా పెద్దయ్యగారు ఉన్నంత వరకు నీకు ఆయనే గురువు ఆయనకే సేవ చేయాలి అని ప్రోత్సహించేవారు. నాకు ఇంత మంచి గురువును ప్రసాదించిన తాత భీమయ్యగార్కి ఋణపడి ఉన్నాననుకొనే వాడిని.

పులుకుర్తిలో తన ఆట, పాట, మాటలతో ప్రజలందర్ని ఆనందింప చేసేవారు. 23-02-2005 రోజు ఒక్కనాడే 33 మంది మా గురువుగారి వద్ద ఉపదేశం తీసుకునేలా చేశారు. అలాగే కోయిల వాయిలో పాలకుర్తి శ్రీనివాస్‌గౌడ్ గారితో సహా 25 మందికి మా గురువు గారు ఉపదేశాలిచ్చినారు. ఇదంత భీమయ్యగారి చలువే !

భీమయ్యగారితో నేను తిరిగిన ఈ పది సంవత్సరాలల్లో చాలా మారిపోయాను. ఎన్నో నేర్చుకున్నాను ! నాకు ఈ జన్మరాహిత్య బోధను ప్రసాదించి నన్ను కడతేర్చిన మహానుభావుడు, పూర్ణ గురుడు నిర్మలానంద గురు పాదాలకు శత సహస్ర వందనాలతో.... ఈ సంచికకు నాలుగు మాటలు.

పెరుగు లింగమూర్తి
ఎస్.ఎస్.నగర్, నారాయణపూర్ క్రాస్‌రోడ్, రేగొండ, వరంగల్.
సెల్ : 9394710851

## అన్ని బోధల కవ్వలిది అచల బోధ

- శ్రీ పాలకుర్తి శ్రీనివాసుగౌడ్



గురుర్బ్రహ్మా గురుర్విష్ణు !
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మః
తస్మైశ్రీ గురవేనమః !

శ్రీమత్ గురుదేవులు శ్రీ సమరసానంద పోరెడ్డి రమణారెడ్డి రాజయోగి గారి గురువులు అయిన, శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల మండలారాధన మహోత్సవము తేది : 24-09-2013 "నిర్మలానంద ఆశ్రమము", పెద్దాపురంలో జరుగు సందర్భంగా..

నాకు ఈ అచలబోధను పరిచయం నా చిన్ననాటి మిత్రుడు నా సోదరుడు అయిన, శ్రీ పెరుగు లింగమూర్తి గారు చేసినారు. నాకు ఒక్కరోజు మా ఇంటికి వచ్చి ఈ బోధ గురించి, ధర్మ-మర్మాలు వివరించినారు. ఒకనాడు, వరంగల్ లక్ష్మీటాకీసు సమీపమున ఒక గురుపూజా కార్యక్రమానికి తీసుకుని వెళ్లాడు. అక్కడ నాకు మొదట పరిచయం అయిన వ్యక్తి శ్రీ నిర్మలానంద, పిల్లలమర్రి భీమయార్యులు గారు. ఆరోజు నాతో చాలాసేపు వేదాంతం గురించి దేవుళ్ళ గురించి, వివరించినారు. ఇంకా మీరు వేదాంతాన్ని సోపాన క్రమంగా తెలుసుకోవాలంటే. "గురు ఉపదేశం" తీసుకోవాలని చెప్పారు. ఆయన సూచన మేరకు మేము, శ్రీ నిర్మలానంద, పిల్లలమర్రి భీమయార్యుల ప్రియశిష్యులైన శ్రీమత్ గురుదేవులు శ్రీ సమరసానంద, పోరెడ్డిరమణారెడ్డి గారు వారి వద్ద పులుకుర్తి గ్రామముయందు తేది : 23-02-2005 రోజున గురు ఉపదేశం పొందినాము. గురుసేవ చేస్తూ సాంఖ్యము తారకము-అమనస్కం మహావాక్య విచారణ-పరిపూర్ణబోధ-కందార్థాలు, కందపద్యాలు ఇలా సోపాన క్రమంగా గురుముఖాన బోధను అభ్యసిస్తున్నాను. అలాగె ఇప్పటి వరకు వున్న సిద్ధాంతాల కంటె అచలబోధ ఎందుకు గొప్పది. అన్న విషయం మా గురువు గారి వద్ద చక్కగా విన్నాను. నేను విన్న-నేర్చుకొన్న కొన్ని విషయాలు మీతో పంచుకుంటాను.

ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం, ఈ మూడు సిద్ధాంతాలు ఏమి చెప్పాయి. శ్రీ శివరామదీక్షితుల వారు అచల పరిపూర్ణ సిద్ధాంతంలో (బృహద్వాశిష్ఠ సిద్ధాంతం) ఏమి చెప్పింది. అన్ని చక్కగా వివరించాడు. అది విన్న తర్వాత ఇప్పటి వరకు వున్న సిద్ధాంతాల కంటే, ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతం కంటే చాలా ఉత్తమమయిన బోధ అని, అవి భ్రాంతి బోధలు. ఇది భ్రాంతి రహిత సిద్ధాంతం. దీనిపై భాగవత క్రిష్ణ ప్రభువులవారు కందార్థాలలో ఇలా వివరించాడు.

కం॥ ద్వైతా ద్వైత విశిష్టులు ! సైతురు విని సైసరెపుడు సైసకపిదపన్ సైతురు, క్రయమున వేరన ! ఆతతమతి జీవశివులనవి వినబోకూ ! నేబోధించినది. విడబోకూ పూతమౌ బయలును పొడజూచిగురునిచే ! ద్వైతా దైత విశిష్టాద్వైతములను మాను ! అవి వినబోకూ !!

ద్వైతము :- జీవుడు సత్యము, ఈ శ్వరుడు సత్యము జగత్తు అసత్యం.

అద్వైతము :- జీవుడు+ఈశ్వరుడు ఏకమే, జగత్ అసత్యం 'బ్రహ్మ సత్యం జగత్ మిథ్యా"

విశిష్టాద్వైతము :- జీవుడు సత్యమే ఈశ్వరుడు సత్యమే జగత్తు సత్యమే.

ఇలా మూడు సిద్ధాంతాల వారు పొంతన లేని సిద్ధాంతాలను ప్రతిపాదించి, ప్రజలను భ్రాంతులలో పడవేశారు. కాని శివరామదీక్షులు పై మూడు సిద్ధాంతాలకు వ్యతిరేకంగా, వారు ఎక్కడ వదిలారో అక్కడ బోధను ప్రారంభించాడు. ఆయన ఏమన్నాడంటే.

-: అచలబోధ :-

జీవుడు అసత్యమే, ఈశ్వరుడు అసత్యమే, జగత్తు అసత్యమే అని చెప్పి భ్రాంతి లేకుండా చేశాడు.

అలాగె అచలబోధ పై మూడింటిని. ఆశాస్త్రీయ మని భావించింది. వాటివలె విచారించవద్దు అన్నారు. ఎందుకనగా అచలబోధలో సృష్టికి మూలం అయిన వస్తువు మూలం లేని గుర్తెరిగె శరీరం. ఈ గుర్తురేరిగె దానిని ఆత్మయని, బ్రహ్మం, అని ఇంకా అనేక రకాలుగా ఊహించి అందులో జీవ-ఈశ్వరులను కల్పించి ఒకటి అబద్ధం అని. మరొకటి నిజం అని, వాళ్ళకు తోచిన పద్ధతిలో విచారించినారు. కాని వుంటే రెండు వుంటాయి. పోతే రెండుపోతాయి. ఒకటి వుండి ఒకటి పోవడం, వాటికి జీవ ఈశ్వరులని పేరు పెట్టడం, అజ్ఞానం. ఆ మతాల వల్ల విషయం స్పష్టం కావటం లేదు. "మూలం లేని ఈ గుర్తెరిగె శరీరం ఏమి లేదు అని అంటే అన్నింటికి పరిష్కారం అవుతుంది. శివరామదీక్షితులవారు ఈ వాదాలకు బేధాలకు అతీతంగా, బట్టబయలు లేని ఎరుక, అని నామకరణం చేసినాడు. అన్నింటికి మూలం లేని ఎరుకే, మూలం. లేని ఈ ఎరుక ఎన్ని చేసిన అబద్ధాలే కదా ! బట్టబయలు ఒక్కటే నిజం. కదా ! ఈ నిజాన్నే నిర్భయంగా చెప్పేది. శ్రీ శివరామదీక్షిత అచల పరిపూర్ణబోధ. జై..గురు...

పాలకుర్తి శ్రీనివాస్ గౌడ్ LIC Agent
గ్రా॥ కోగిలవాయి, మం॥ ఆత్మకూర్, జి॥ వరంగల్.
సెల్ : 9866274857

## నేటి నిజగురువు భీమయార్యులు

– శ్రీ గడబోయిన రమేష్



ఆనాటి ఆది గురువులు ఆదిశంకరచార్యులు అయితే నేటి నిజగురువు భీమయార్యులు గారు ఉన్న భావన నాలో కలిగింది. ఎందుకంటే ప్రస్తుత సమాజంలో రాజకీయ దేవునికి ఉపవాస పూజలు చేస్తు నేను పూజ చేస్తేచాలు. నాకు అన్ని వరాలు ఇస్తారు. అన్ని మూఢనమ్మక భ్రమలో ఉన్న వారిని సైతం తన యొక్క నిజమైన గురుభోద వాక్యాలతో నిజమైన దేవుడిని చూపిన నిజగురువు గారు. భీమయార్యులు మనోవ్యాధి కన్న మహారోగం లేదని మనస్సుని నిర్మలంగ ఉంచితే నిర్భయంగా జీవించవచ్చని చెప్పిన నిజగురువు నిర్మలానంద భీమయార్యులు గారు. తమ గాన, నృత్య కళలతో అందరిని మంత్రముగ్ధులను చేసి వినసొంపుగా వినిపించి కనుల విందుగా కనిపించే బోధ భీమయార్యుల గారిది. దూహం దూరమైన గానం మన చెవుల చేరువులో నృత్యం కన్నులలోగిలిలో కలకాలం ఉంటుంది.

గడబోయిన రమేష్
గ్రా॥ కొగిల్వాయి, మం॥ ఆత్మకూర్, జి॥ వరంగల్. సెల్ : 9848354468

# స్త్రీల పక్షపాతి శ్రీ భీమయ్యగారు

- శ్రీ గోరంటల భవాని, విక్రమ



శ్రీమద్గురుదేవులు గీదమోహన్‌రెడ్డి గారి, గురువుగారైన అనగా మా పరమగురువు శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్య రాజయోగి గారి పరిచయము, మాకు దొరికింది.

తేది : 05-01-2001న మా గురువు గారు మోహన్ రెడ్డార్యులు ఈ అయ్యగారిని మరియు రాజేందరయ్య గారిని పిలిపించి, వారి సమక్షంలో మాకు ఉపదేశము యిచ్చినారు. అప్పటి నుండి వారు మా పూజకు రావటం జరిగేది. ప్రతి పూజలో స్త్రీలు మాట్లాడాలని మమ్మల్ని ఎంతో ప్రోత్సహించేవారు.

ఈ ప్రోత్సహించడం ఎందుకంటే మా గురువు తూడి దేవమాంబ గారు స్త్రీయే కాబట్టి మిమ్మల్ని మాట్లాడాలని అంటున్నాను అని అనేవారు. మేము మాట్లడితే ఎంతో సంతోషించేవారు. ఈ విధంగా మాట్లాడాలని చెప్పేవారు. వారెప్పుడొచ్చిన గురుసేవా ధర్మములను పాటించాలని మరి మరి చెప్పేవారు.

ఎందుకు పాటించాలనగా ? "ఆహార నిద్ర, భయ సంగమములు" మానవులకు ఇతర పశు పక్ష్యాదులకు సమానమేగాని మానవునకు జ్ఞాన మధికము.

సృష్టిలో ప్రతి జీవియు జనన మరణములు పొందుచూ సుఖ దుఃఖములను అనుభవించుచున్నది. సుఖము గలిగినపుడు సంతోషించుట దుఃఖము కలిగినపుడు బాధ పడుట సహజము. కాని మానవ జన్మలో విచారణ జ్ఞాన మధికము. అయినను మానవుడు తనకు కష్టములు గలిగినపుడు బాధపడుట సుఖము గలిగినపుడు సంతోష పడుట జరుగుచున్నది. కాని నాకీ సుఖ దుఃఖములు కలుగుటకు కారణమేమి. దీనిని రహిత పరుచుటకు నేనేమి చేయవలెను. అను జిజ్ఞాస కలుగువారు అరుదు.

తనకుండు జ్ఞానమును సద్వినియోగ పరుచుకొనుటకు ప్రయత్నించవలెను. ఇట్టి "ఆత్మ జ్ఞాన" ప్రాప్తి ఒక మానవ జన్మకే గలదు. సృష్టిలోని ప్రాణులన్నింటికన్న మానవ జన్మయే ఉత్కృష్టమైనదని శృతులు పలుకుచున్నవి.

వివేక వంతులైన వారు తత్వ విచారణ చేసి నిజము కనుగొనుటకు ప్రయత్నించిన అప్పుడు మానవుని విజ్ఞానము అభివృద్ధిచెందె. శాశ్విత సుఖమునకు మరియు దుఃఖ నివృత్తికొరకు ప్రయత్నము జరుగును. ఆపైన జనన మరణ రహిత విధానము మానవ జన్మకు పరమార్థమని మానవుడై పుట్టినందుకు మరల పుట్టుక లేకుండా చేసుకోవటమే తన జీవిత లక్ష్యముగా నిర్ణయించుకొనుట జరుగును. ఇదియే మోక్షమార్గము జనన మరణ భ్రాంతి రహిత మార్గము.

ఈ మార్గమునకు సాంప్రదాయ బద్ధముగా ముందు తానొక శిష్యుడై క్రమశిక్షణతో గురు సన్నిధానమున శ్రద్ధ, భయం, భక్తులతో అనుభవరూపంగా విద్యనార్జించుచూ పాటించి గురువాజ్ఞానుసారంగా తానొక బోధాధికారిగా మారి. తాను తెలుసుకొన్న ధర్మమును తు॥చ॥తప్పక పాటిస్తూ, పాటింప జేస్తూయుండ వలెను. ఇట్లు నిర్వహించని యెడల ఈ పరిపూర్ణ బోధవలన మేలుకన్న కీడే ఎక్కువ జరుగును. అనుటలో ఎట్టి సందేహము లేదు అని చెప్పేవారు. అట్టి సద్గురుమూర్తి పరమగురుడు శ్రీ నిర్మలానంద భీమయార్యుల వారి మండలారాధన సందర్భంగా ప్రత్యేక సంచికలో ద్వాదశ నమస్కారాలతో మా స్మృతులను సమర్పించుకుంటున్నాము.

"సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు"

**గోరంటల భవాని, విక్రమ**

పో॥ భూపాల్‌పల్లి, జి॥ వరంగల్.

సెల్ : 9948109500

## శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమూఖ్య కరపత్రము

**- శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయస్వామి**

అఖండాత్మ స్వరూపులూన భక్త మహాశయులకు మేము హృదయ పూర్వకముగా విన్నవించుకొనే విన్నపం ఏమనగా!

విశ్వమానవ కళ్యాణమునకు, సర్వమానవ సౌభ్రాతృత్వమునకు ఏకాత్మ భావమునకు, సనాతన ధర్మమైన ఈ పరిపూర్ణ బోధ సిద్ధాంతము ఎంతగానో సహకరిస్తున్నది. వేదోపనిషత్తులకు నిజార్థాన్ని తెలియజేసి సర్వసందేహములు తీరుస్తూ ఈ సాంప్ర దాయము ఉపకరిస్తూయున్నది. ఈ సిద్ధాంతమునకు పరిపూర్ణ బోధ సిద్ధాంతమని పేరు. పరిపూర్ణ బోధయనగా పరిపూర్ణ పరబ్రహ్మమును తెలిపేదే కాదు. దేహతత్వమును జీవతత్వమును, ఆత్మతత్వమును, పిండబ్రహ్మాండ సృష్టి విధానమును, జీవేశ్వర ఐక్యమును చతుర్విధ పురుషార్థములను తెలియజేసి అత్యంత దుఃఖ నివృత్తి పరమానంద ప్రాప్తిని కలిగించి జనన మరణ రహితమగు శాశ్వత మోక్షమును జన్మరహితము వరకు అన్ని తరగతులకు క్షుణ్ణంగా ప్రబోధించును. గనుక పరిపూర్ణబోధ సిద్ధాంతమని ప్రసిద్ధి చెందినది. కాని కేవలం పరిపూర్ణమును చెప్పేదికాదు. అన్ని ధర్మాలు పరిపూర్ణంగా తెలియజేయునవి. గనుక దీనికి పరిపూర్ణ సాంప్రదాయమని పేరు వచ్చినది. కనుక సర్వ మానవులు దీన్ని తెలుసుకొని, సందేహ నివృత్తి పొంది, సుఖకరమగు శాంతియుత జీవనమును గడుపుటకు ఈ బోధ ఎంతో మేలైయున్నది. సాధూనాం దర్శనం పుణ్యం స్పర్శణం పాపనాశనం అను వాక్యాన్ని అనుసరించి మేము తలపెట్టిన ఈ జ్ఞాన యజ్ఞమునకు పలు రాష్ట్రములనుండి మరియు వివిధ జిల్లాల నుండి గురువులను రప్పించి మన పర్కాల పట్టణ ప్రాంతములో యున్న భక్త మహాశయులందరు వారిని దర్శించే కొరకు ఈ గురుపూజా వైజ్ఞానిక వేదాంత సభను నిర్వహించుచున్నాము అందుకని మన జన్మతరించే ఈ సదవకాశాన్ని వృధాచేయకుండా సాంగోపాంగముగ గురుపూజా కార్యక్రమములో పాల్గొని, తీర్థప్రసాదాలు స్వీకరించి, పెద్దల ఆశీర్వాదాలు పొందుతారని కోరుచున్నాము. అందుకని ధర్మదాతలైన మీరు ఉదార స్వభావులై ఈ జ్ఞాన యజ్ఞమునకు తమవంతు కృషిగా సహాయ సహకారములు అందించి గురుకరుణకు పాత్రులై జయప్రదం చేయగలరని ప్రార్థిస్తున్నాము. పత్రరచణకు ప్రేరణ : బండిచక్రపాణి.

శ్రీ నిష్కలానంద బండి చక్రపాణి కోరిక మేరకు ఈ కరపత్రం

## నిర్మలానంద ఆశ్రమ పక్షాన 1991లోని కరపత్రం

శ్రీమద్బృహద్వాశిష్ట సిద్ధాంత అచల ప్రబోధ సాంప్రదాయకులకు, బ్రహ్మజ్ఞానసంపన్న పరమభక్త శిఖామణులకు, సాధుసజ్జనులకు మరియు సర్వమానవ సోదర సోదరీమణులకు సవినయముగా తెలియజేయు విన్నపము ఏమనగా!

సనాతన అచలపరిపూర్ణ బ్రహ్మ విద్యా గురుసాంప్రదాయమును ఆదిలో శ్రీదక్షిణామూర్తి పరబ్రహ్మ మౌనసౌంజ్ఞను, శ్రీ మహావిష్ణువు సూర్యుడు, యాజ్ఞల్కి జనక, శుక, సాందీప శ్రీకృష్ణ, అర్జున ఉద్ధవులైన సద్గురువులు సాంప్రదాయబద్ధముగా ఒకరి నుండి ఒకరికి వచ్చినది. అట్టి పరబ్రహ్మ విద్యను కలియుగంలో శ్రీధరస్వామి ద్వార శ్రీమద్బృహద్వాశిష్టా సిద్ధాంత అచలగురుబోధ ప్రతిష్టాపనాచార్యులైన శ్రీమద్రామడుగు శ్రీశివరామదీక్షితులవారు వేలసంవత్సరాలుగా అభివృద్ధి చెందిన ఆధ్యాత్మిక, తత్వచింతనలో ఏర్పడిన అస్పష్టతను నివారించి సర్వమానవులకు సులభోపాయముగా తెల్సుకొనుటకు సంకల్ప రహితమైన జనన, మరణ దుఃఖము బాపగలందులకై జన్మ రహిత సిద్ధాంతమైన పరిపూర్ణపరబ్రహ్మ విద్యను జనులందరు జన్మరహితులై తరించబడానికి మన భారతదేశంలో చాటి చెప్పినవారిలో ఒకరు. అట్టి వారందరికి మా హృదయపూర్వక ద్వాదశ నమస్సుమాంజలులు.

అట్టి జననమరణ భ్రాంతిరహిత సిద్ధాంతమైన పరిపూర్ణ పరబ్రహ్మవిద్యను ఆంధ్రదేశంలో ఆధ్యాత్మిక సంపదలకు పుణ్యక్షేత్రాలకు నెలవైన ఓరుగల్లుపట్టణానికి సుమారు 12కి. మీ. దూరములో కాకతీయులనాటి పవిత్రకట్టడాలతో విరాజిల్లుతున్న పెద్దాపురంగ్రామంలో అచల ప్రబోధాత్మకమైన నిర్మలానంద ఆశ్రమము భక్తులసహాయంతో నిర్మించి తద్వార ఆశ్రయించిన సర్వమానవులకు జనన మరణములతో కూడిన దుఃఖ భూయిష్టమైన ఘోర సంసారసాగారాన్ని దాటించుటకై పరమపవిత్రమయిన ఈ ఆశ్రమ

నిర్మాణమును చేపట్టడం జరిగినది.

వదాన్యులు, దాతలు గౌ॥ శ్రీ పోలం మాదవరెడ్డి గారు ఇందుకు కావలసిన సుమారు రెండు ఎకరములు భూదానము చేసి ఆశ్రమ నిర్మాణమునకు తోడ్పడినారు.

మరియు మద్గురుదేవులు శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యులవారి ప్రియ శిష్యులు కొందరు వారివారి శక్త్యానుసారం దానరూపముగా వారి సలహా సహాయాలను అందజేసి ఆశ్రమనిర్మాణం చేపట్టి మొదటిదశగా కొంతపనిని పూర్తిచేసినారు.

ఆశ్రమ నిర్మాణ కార్యక్రమములో చుట్టూ ప్రహరి గోడ, నీటిసౌకర్యము కొరకు బోర్‌వెల్, పూలతోట, ఫలములనిచ్చే చెట్లనునాటడము, విశాలమయిన ఆశ్రమభవనం మొదలగు ఆశ్రమోపయోగమయిన అన్ని సౌకర్యాలను అంచలవారిగా పనులు చేయుటకు తలపెట్టడము జరిగినది.

భక్తులారా ! లక్షలవ్యయంతో కూడుకున్న ఈ ఆశ్రమనిర్మాణమునకు తమవంతు కర్తవ్యముగా భావించి పెద్దమొత్తములో భారీవిరాళములు అందజేసి మీ యొక్క సంపూర్ణ సలహాసహాయములనందజేసి శక్తికి మించకుండ, లోబత్వములేకుండా ఈ పవిత్ర కార్యమునకు చేయూతనిస్తారని, ఇవ్వగలరని కోరుచున్నాము.

విరాళములు రూ. 25000/–లు రూ. 15000/లు రూ. 10000/–లు రూ. 5000/–లు ఇచ్చిన ధాతలయొక్క ఫోటోలు తగు సైజులో తగిన స్థానములో ఆశ్రమములో ఉంచబడును. గురువులైనచో గురుస్థాణములో ఉంచగలము, రూ. 2500, రూ. 1000/–, రూ. 500/–లకు తక్కువ ఇచ్చినవారిపేర్లు శిలాఫలకముపై వ్రాయబడును.

ఈ ఆశ్రమానికి తోడ్పడే ప్రతీధాతపేరు శాశ్వత పరచి వారికి ఆశ్రమఅచలబోధ ప్రణాళికా స్వరూపాన్నందించగలము.

ఆశ్రమ నిర్మాణ దీక్షాదక్షులైనవారికి మరియు ఇట్టి మహోపకారమమయిన ధాతలకు సద్గురుమూర్తి ఆశీర్వదించి ఆయురారోగ్యములిచ్చి సుసంపదల నొసంగి దైవచింతనముగల విజ్ఞానమును ప్రసాదించి జననమరణ భ్రాంతిరహిత స్థితినినొసంగి కాపాడవలయునని త్రికరణశుద్ధిగా ప్రార్తించుచున్నాము.

కనుక దాతలు విశాల హృదయములై ముందుకు వచ్చి సమాజములో ఏర్పడిన దురాచారాలు, మూఢ నమ్మకాలు, కాలుష్యాలనివారణకు ఏర్పడనున్న ఆశ్రమాన్ని పెద్దాపురం గ్రామములో ఈగురుతర బాధ్యతను తమదిగా స్వీకరించి నిర్మలానంద ఆశ్రమ నిర్మాణమునకై చేయూతనివ్వాలని కోరుచున్నాము.

ఆనాటి మా విజ్ఞాపన–నేటికి కూడా విజ్ఞాపనగా సంచికలో ముద్రిస్తున్నాము.

– శ్రీ నల్ల ఉపేంద్రార్యులు

## సంతాపం

– శ్రీ పోలం మాధవరెడ్డి గారు



శ్రీ భీమయార్యులవారు స్వర్గస్తులైనారని తెలియగానే, బాధకు గురైనాను. శ్రీ భీమయ్యగారు తన శిష్యబృందం మరియు గ్రామస్తులతో నా నివాసమునకు వచ్చి ఈ గ్రామములో నిర్మలానంద ఆశ్రమమం స్థాపన గురించి కొంత స్థలము చూపెట్టగలరని కోరినారు. ఆ సమయములో నా హృదయంలో ఒక దేవదూత నా ముందు ఉన్నట్టు ఊహించి కాదనలేక సరెనని వెంటనే నా స్వంత ఆధీనంలో ఉన్న రెండు ఎకరాల భూమి చూపటం జరిగింది. నిర్మలానంద ఆశ్రమం ప్రారంభోత్సవం జరిగింది. పెద్దలచే వేదాంత సభలు జరిపించినారు. ఇప్పుడు వారు లేరు. వారి ఆత్మకు శాంతి చేకూర్చగలరని, వారి సంతతికి ఆయురారోగ్యములు కలగాలని భగవంతున్ని ప్రార్థించుచున్నాను.

పోలం మాధవరెడ్డి గారు
గ్రా॥ పెద్దాపురం, మం॥ ఆత్మకూర్, జి॥ వరంగల్.



శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య బహూకరించిన

# బిరుదు - సన్మాన పత్రం

## అచల బోధ, గాన, నృత్య రత్న

## ఏకాదశ సీస పద్య రత్నమాల

కవి : భూమానంద నల్ల ఉపేంద్రయ్య

**తేది : 07-05-2005** శనివారం కర్ణాటక రాష్ట్రం కోలారులో సేవాసమాఖ్య కేంద్ర స్థాయిలో జరిపిన మహాసభల సందర్భంగా శ్రీ నిర్మలానంద పిల్లలమఱ్ఱి భీమయార్య రాజయోగి గారు అచలబోధలో జరిపిన కృషిని గుర్తించి అచలబోధ గాన, నృత్య, రత్న బిరుదుతో, వెండి కిరీటంతో కోలాహలంగా జరిగిన సన్మాన సభల సందర్భంగా స్పందించి వ్రాసిన ఏకాదశ పద్య రత్నమాల.

1. పిల్లల మఱ్ఱను పేరున్న వంశాన-అవిర్భవించితి రయ్య మీరు
రాజలింగయ్య రాజమ్మ సుదంపతుల్-కడుపార కన్నట్టి ఘనులు మీరు
అమ్మ శ్రీ దేవాంబ ఆశీర్వదించిన-సద్గురు పథగామి స్వామి మీరు
అచల బంధువులంత ఆదరిస్తుండంగ-శ్రేష్టంగ తిరుగు దేశికులు మీరు

తే॥ గొప్ప వారికి సోదర కూర్మి పంచి-గొప్ప వారిగ శిష్యుల కూర్మి పెంచు
నిర్మలానంద, భీమార్య, నిజగురుండ-అచల సద్బోధ, గాన, నృత్యాల రత్న

2. అతి బాల్య దశలోనె అమ్మ దగ్గర జేరి-అంకిత మయ్యితి రయ్య మీరు
భజనలో అమ్మను భక్తితో కీర్తించి- గ్రంథ మంకిత మిస్తి రయ్య మీరు
అమ్మ పూజలనాడు ఆనంద భరితులై-గాన మాలాపిస్తి రయ్య మీరు
అమ్మ ఊరేగింపు ఆనంద వేళలో-అచల నృత్యము చేస్తి రయ్య మీరు

తే॥ అచల గురువుల నెందర్నొ ఆశ్రయించి-అచల బోధను అందితి రయ్య మీరు
నిర్మలానంద, భీమార్య, నిజగురుండ-అచల సద్బోధ, గాన, నృత్యాల రత్న

3. ఎనబదేండ్లైతేమి, ఇంకిర్వదైతేమి-నిత్య యౌవనకాంతి, నిజము మీది
ఎంత దూరంబైన, ఎంత ద్రవ్యంబైన-గురుపూజలకు నేగు, కోర్కె మీది
తన శిష్యులని కాదు, తదితరులని కాదు-అందర్ని ప్రేమించు, హక్కు మీది
ఎదిరించు వారలు, ఎంత వారైనను-నీళ్లు మ్రింగించేటి, నేర్పు మీది

తే॥ అందరికి తల నాల్కలా అణగి మెణగి-ఉండు వినయము, మీది ఉద్దండచరిత
నిర్మలానంద, భీమార్య, నిజగురుండ-అచల సద్బోధ, గాన, నృత్యాల రత్న

4. ఆశ్రమ నిర్మాత, అక్క పరమాంబతో-ఆలోచనలు చేయు, ఆర్తి మీది
చెన్నస్వామయ్యతో చెలిమి చేయుచు గొప్ప-పాటలు పాడేటి, ప్రజ్ఞమీది
ఎల్లవేళల కవి, నల్ల ఉపేంద్రతో-చర్చించు బోధల, శ్రద్ధ మీది
కూనలచ్చయ్యతో, కూడి చరించేటి-ఆట పాటల జీవితంబు మీది

తే॥ ఓరుగల్, ములుగు, రాధపూర్, ఒక్కటేమి-అన్ని చోట్లల్లో, సోదర సన్నిహితుడ
నిర్మలానంద, భీమార్య, నిజగురుండ-అచల సద్బోధ, గాన, నృత్యాల రత్న

5. సేవా సమాఖ్యను చేపట్టినది మొదల్-త్రికరణ శుద్ధిగా తిరిగినారు
కేంద్ర ఉపాధ్యక్ష కీర్తి చేకొన్నారు-శిష్యుల తన వలె త్రిప్పినారు
ప్రతిచోట సన్మాన ప్రాభవ మందారు-అమ్మకే అంకితం బన్నవారు
కోలారు సభలలో గురువుల సన్నిధి-బిరుదులు పొందిన పెద్దవారు

తే॥ శ్రీ కిరీటము, కుండలాల్, శ్రీకరముగ-అందిపొందిన సద్గురుం డచల యోగి
నిర్మలానంద, భీమార్య, నిజగురుండ-అచల సద్బోధ, గాన, నృత్యాల రత్న

6. గురు డంటె మాటలా, కుచ్చితు లెరిగేర-శిష్యుల సవరించు, చేవ వలయు
సేవ చేసిన వారె, సేవలు నేర్పేరు-బోధ తెల్సిన వాడె, బోధ చేయు
శిష్యుని కొడుకుగా, సేవలందించాలె-ప్రతిపల్లె తిరగాలె, పగలు రాత్రి
తన విద్య నందించి, తన యంత వానిగా-చెయ్యాలె, గురుడైతె, శ్రేష్ఠుడైతె

తే॥ భీమయార్యుడీ ప్రక్రియ ప్రీతి నేర్చి-ఏకవింశతి గురువుల నెలమి కూర్చె
నిర్మలానంద, భీమార్య, నిజగురుండ-అచల సద్బోధ, గాన, నృత్యాల రత్న

7. మంచి గురుండని ఎంచగా వలెనంటె-ధనధాన్య సందల్ పనికిరావు
మంచి గురుండని ఎంచగా వలెనంటె-పలుగాకి విద్యలు పనికి రావు
మంచి గురుండని ఎంచగా వలెనంటె-బల పరాక్రమములు పనికి రావు
మంచి గురుండని ఎంచగా వలెనంటె-వాద వివాదముల్ పనికిరావు

తే॥ మంచితనమొక్కటే గొప్ప మంచిచేయు-మంచి భీమార్య మన సంత మంచిదయ్యె
అందుకే మంచి గురువుగా అవని వెలిగె-గాన, నృత్యాల, బోధల ఘనత పెరిగె

8. సతి ఉత్తరాంబ తా, సాహచర్యము వల్ల-అచలాన ఘనకీర్తి నందినారు.
తనయంత శిష్యుల ఘనత వల్లనె తాను-అచలాన ఘనకీర్తి నందినారు.
సంతాన, మందరి, సమ్మతి వల్లనె-అచలాన ఘనకీర్తి నందినారు.
సేవా సమాఖ్యకు, చేసిన కృషి వల్ల-అచలాన ఘనకీర్తి నందినారు.

తే॥ అహము రహితము, వినయము, అచి తూచి నడక వల్లనె తానింత నడచి వచ్చె
శేష జీవిత మంతయు శ్రీయుతముగ-గడువ వలె బాగ సద్గురు కరుణ వల్ల

9. శివరామ దీక్షితా, సిద్ధాంత బోధను-జగమంత చాటేటి, జాన ఎవరు
తూడిదేవాంబను, వేడి సత్కృతులచే-దేశమెల్లను చాటు, ధీరుడెవరు
శ్రీ మించు అచలాన, శ్రేష్ఠమౌ గురుజండ-నవనిలో త్రిప్పేటి, ఆర్యులెవరు
తన వెంట శిష్యుల, తనవంటి వారుగా-చేసి సమాఖ్యకు చేర్చె నెవరు

తే॥ అట్టి సద్గురు, భీమార్య పట్టుదలను-వేయినోళ్ళతొ-వర్ణించ వీలుపడునె ?
అమ్మ దేవాంబ శిష్యుల్లో అంతవారు-కలరె ? గురుసేవ చేసిన ఘనుడతండు

10. శిష్యులు కవులయ్యి, శ్రేష్ఠమౌ గేయాల-నీ కీర్తి జగమంత నిలిపినారు
శిష్యులు గురువులై శిష్యుల గావించి-నీ కీర్తి జగమంత నిలిపినారు
శిష్యులు ప్రతి చోట చేరి, పూజలు చేసి-నీ కీర్తి జగమంత నిలిపినారు
శిష్యులు అటనట చేసువన్యాసముల్-నీ కీర్తి జగమంత నిలిపినారు

తే॥ ఎన్ని తీరుల నీ కీర్తి ఎదుగుచున్న మీరు మాత్రము, ప్రవిమల, మేరు సములె
నిర్మలానంద, భీమార్య, నిగమ వినుత-అచలు లందర, కాదర్శమైన గురుడ

11. శిష్యులే నాధనం శిష్యులే సర్వంబు-శిష్యుల ప్రాణంగ చెప్పినారు
శిష్యులకై నేను చెప్పిన బోధలె-సర్వ సంపదలని చటినారు
శిష్యుల మధ్యనే చేసిన కృషియంత-అమ్మ సేవలటంచు అన్నవారు
శిష్యులు పూర్ణులై, శిష్యులు గురులయ్యి-అభివృద్ధి అయితె చాలన్నవారు

తే॥ భీమయార్య, మీ ఆశయం పృథ్వినంత-విస్తరించెను, అదిచాలు, విమల చరిత
యాభదేండ్లుగ మీకృషి, ఆగకుండ-సాగె శివరామ దీక్షిత స్వామి కృపతొ..

## భీమయార్యుల వారు పరిపూర్ణ భావజ్ఞులు

- శ్రీ యధార్థబోధోపదేశిక డా॥ కూన దయానందస్వామి
ప్రధాన కార్యదర్శి శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య



నేను పుట్టకముందు మా నాన్న గారైన శ్రీ అచలానంద కూన లక్ష్మణార్యులకు శ్రీ భక్తానంద దేవమాంబ గారి వద్ద ఉపదేశం ఇప్పించింది. శ్రీ భీమయార్యులవారే శ్రీ దేవమాంబ గారే నాకు పేరు పెట్టినారట. అప్పటికే శ్రీభీమయార్యుల వారి కుటుంబము పాలంపేటలో ఉండేది. శ్రీ భీమయార్యుల వారిని మామయ్య అని శ్రీమతి ఉత్తరాంబ గారిని అత్తమ్మ అని పిలిచేవాన్ని. నాకు 15వ ఏట ఉపదేశం అయిన తరువాత శ్రీ తంగళ్ళపల్లి రాజేందర్ అన్నయ్య గారి సహచర్యం వల్ల పెద్దలను అమ్మ-అయ్యఅని పిలవడం నేర్చుకున్నాను. నర్సాపురంలో మాతృశ్రీ దేవమాంబ గారికి ప్రత్యేక గౌరవ మర్యాదలు ఉండేది. గ్రామ ప్రముఖులంతా వారిశిష్యులే, మా నాన్నగారు, శ్రీ జోడు కొమురయ్య గారు శ్రీచిగురు రామస్వామి గారు, శ్రీ చొల్లేటి నర్సిరెడ్డి గారు శ్రీతడుక రామస్వామి గారు, రాయబారపు వీరన్న గారు, మంతెన బొంద్యాలుగారు, శ్రీకొంక మల్లయ్యగారు, శ్రీ వెంకట్రాములు గారు, శ్రీ బాలాజి సమ్మయ్య మొదలగు వారు మాతృశ్రీ దేవమాంబ గారివద్ద ఉపదేశం పొందియున్నారు.

1974లో శ్రీ దేవమాంబ గారి నిర్యాణానంతరం నర్సాపురంలో శ్రీ భీమయార్యుల వారికి అలాంటి ఆదరణే ఉండేది. మాతృశ్రీ దేవమాంబ గారి తర్వాత వీరే ఉపదేశాలిచ్చేవారు.

శ్రీ భీమయార్యులవారు మా నాన్నగారు శ్రీ మేడం సమ్మయ్యగారి (నర్సాపురం) డ్రామా గ్రూపులో పాత్రధారులు. ఆ కాలములో భాగవతాలు వేసేవారిపై విపరీతమైన క్రేజ్ ఉండేది. పాలెంపేటలోని ప్రసిద్ధమైన రామప్పదేవాలయములోనూ వీరు ఖడ్గాలు వేసుకుంటూ శరభఘోషతో అగ్నిగుండాలు దాటేవారు.

ఎందరున్నా శ్రీ భీమయార్యులు లేనిలోటు పూడ్చలేనిది. ముఖ్యంగా వారి కుటుంబ సభ్యులది మరీ దయనీయమైన స్థితి. శ్రీ పరిపూర్ణం శ్రీ శివన్న శ్రీరామన్నలకు అధికారం ఇచ్చినారు.

శ్రీ భీమయార్యుల వారు భౌతికంగా మనమధ్య లేనప్పటికి వారి భావాలు మన మనోఫలకాలపై ప్రతిఫలిస్తూనే ఉన్నాయి. కుటుంబ సభ్యులకు మనోధైర్యాన్నొసంగాలని గురు పరమాత్మను ప్రార్థిస్తున్నాను.

## అభిప్రాయాలు

మాతృశ్రీ తూడి దేవదమాంబగారి ప్రియశిష్య రత్నము **శ్రీమతి నిష్కలానంద బల్లభద్ర పరవేశ్వ రాంబగారు** శివనగర్, వరంగల్. నిర్మలానంద తత్వదర్శిని నుండి.

పిల్లలమర్రి భీమన్న మద్గురు పుత్రుడు. చిన్ననాటి నుండి మేము గురుముఖతా పరిపూర్ణబోధ వినునప్పుడు మిక్కిలి శ్రద్ధాభక్తులుగల్గి ప్రవర్తించువాడు. మా యిద్దరికొకే సమయమున అధికారమిచ్చుటకు నావలె యితడును విముఖతనే ప్రదర్శించెను. కాని గుర్వాదేశము నాకు వలె యీయనకు కూడా దాటనిదే యయ్యేను.

**బోధానంద గూడూరు చెన్నస్వామిగారు, గోవిందరాజుల గుట్ట క్రింద.**

గ్రంథము సామాన్యముగా నెంచక తప్పక పై విషయలయందు శ్రద్ధ చేసినచో అజ్ఞానము తొలగి మానవకోటి సంశయములు తీరి పరిపూర్ణస్థితి పొందుదురని నమ్ముచున్నాను. ముముక్షువులకు నా సహోదరుడగు శ్రీ నిర్మలానంద గారు, అర్పించిన కావ్య కుసుమము తప్పక చదువ ప్రార్థించుచున్నాను.

**- యదార్థ బోధోపదేశిక శ్రీ మేర్గు యాకయ్య గారు, శివనగర్, వరంగల్.**

పాటలు, ప్రాసానుగతమైనవి కొన్ని అంత్యప్రాసమయమైనవి కొన్ని మిక్కిలి సుందరముగా గాన్పించుచున్నవి. సినిమాపాటల తీరుల వ్రాయుట ఇంకా సొబగుగాయున్నది. "ఉన్నదీ నరకంబున్నదీ" అను పాట కవికిగల ప్రజ్ఞాపాటవమును బుజువు పర్చుచున్నది.

ఓం

శ్రీ శ్రీధరుల వారి ప్రియశిష్యులు

శ్రీ గురుభ్యోనమః

శ్రీ సద్గురుభ్యోనమః

శ్రీ శివరామదీక్షితులు

శ్రీ భాగవత కృష్ణదేశికులు

శ్రీ భక్తానంద తూడి దేవమాంబ గారు

# శ్రీ మదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య అనుబంధ పీఠము

గ్రా॥ పెద్దాపురం రి.నెం. ఎ-40309/187-07

శ్రీ భక్తానంద తూడి దేవమాంబ రాజయోగిని వారి ప్రియశిష్యరత్నం

# శ్రీమత్ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్య రాజయోగి గారి మండల ఆరాధన పూజ మహోత్సవ ఆహ్వాన పత్రిక

**శ్రీ నిర్మలానంద ఆశ్రమము**
గ్రా॥ పెద్దాపురం, మం॥ ఆత్మకూరు,
జి॥ వరంగల్-506342.

**తేది: 24-09-2013**
భాద్రపద బ॥ పంచమి
మంగళవారం

శ్లో॥ గురుబ్రహ్మ గురువిష్ణు । గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మ । తస్మైశ్రీ గురువేనమః ॥

శ్లో॥ శ్రీసద్గురు భక్తానంద పాద । కమలామృత పానభృంగం
శ్రీ నిర్మలానంద బోధోపదేశకం । భీమయార్య గురు చరణం భజే ॥

**అచలతత్వ గాననృత్య కళాకోవిదులు**

**శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్య రాజయోగి గారు**

స్వస్తిశ్రీ విజయనామ సం॥ భాద్రపద బ॥ పంచమి తేది : 24-09-2013 మంగళవారం రోజున శ్రీమత్ నిర్మలానంద పిల్లలమర్రి భీమయార్యుల వారి మండలారాధన కార్యక్రమం **శ్రీమత్ భూమానంద నల్ల ఉపేంద్రార్యులు,** శ్రీ నిరసనానంద నర్మేటి బుచ్చి వీరయ్య, శ్రీ నిశ్చలానంద గీద మోహన్‌రెడ్డి, శ్రీ నిష్కలానంద బండి చక్రపాణి, శ్రీ పరిపూర్ణానంద ఓరుగంటి బుచ్చిరాములు గార్ల ఆధ్వర్యములో జరుగును. తీర్థప్రసాదములు స్వీకరించి జననమరణ భయభ్రాంతి రహిత స్థితిపరులు కావాలని వినయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాము.తేది : **24-09-2013 మంగళవారము కార్యక్రమం. ఉదయం 5గంటలకు ప్రభాతసేవ-మేలు కొలుపులు** బ్రాహ్మీముహూర్త కాలమందు అంపోజ్వాల జగన్నాథ రాజు దంపతులు, విజ్ఞానాంబ కొప్పొన అమ్మాజమ్మ గారు, సిరికొండ సుశీలమ్మ, అమలానంద బండ్యాల పున్నమ్మ, గురుసేవాతరంగిణి కందకట్ల శాంతమ్మ గార్ల ఆధ్వర్యములో బోధానంద దాసి వనమాల, భక్తానంద వరిపెల్లి రంగమ్మ, గూడెల్లి లక్ష్మీ, గోరంటల భవాణి, సాదు నర్సింహ్మ రాములు గారలచే జరుగును. **ఉదయం 6గంటలకు లఘుపూజ** శ్రీ మద్రామడుగు శివరామదీక్షితులు, శ్రీ భాగవత కృష్ణదేశికేంద్రులు, మాతృశ్రీ భక్తానంద తూడి దేవమాంబ గారల పాదుకలపూజ శ్రీమతి పట్టెం లింగమాంబ, కూన కొమరమాంబ, గంగిశెట్టి సమ్మక్క వారి ఆధ్వర్యములో బ్రహ్మానంద కోడం శంకరయ్య దంపతులు, పూర్ణానంద చింతల సదానందం దంపతులు, బ్రహ్మానంద పిల్లల మర్రి చంద్రమౌళి దంపతులు, పిల్లలమర్రి సమ్మయ్య దంపతులు, పిల్లలమర్రి భద్రయ్య దంపతులు, ఆడెపు వెంకటస్వామి దంపతులు, మాందాపురం శంకరయ్య దంపతులు, బలబత్తుల కనకయ్య దంపతులు, మార్తగట్టు మల్లయ్య దంపతులు, తడక రామస్వామి దంపతులు, చింతిరెడ్డి లక్ష్మమ్మ, చింతిరెడ్డి సరోజనమ్మ, కాసర్ల మోహన్‌రెడ్డి మరియు తూడి దేవమాంబగారి శిష్యబృందంచే జరుపబడును. **ఉదయం గం॥ 6-30ని.లకుసామూహిక అనుష్టానము** శ్రీ సమరసానంద తిరుపతయ్య స్వాములవారు, శ్రీ సేవానంద రాపోలు బ్రహ్మానందచారి గారల ఆధ్వర్యములో జరుపబడును. **ఉదయం 7గంటలకు గురుగీతా పారాయణము** శ్రీ సచ్చిదానంద మద్దుల వెంకటరెడ్డి ఆధ్వర్యములో శ్రీమతి కూకట్ల లలిత గారిచే జరుగును. **ఉదయం 8గంటలకు కాఫీ-ఫలహారములు** శ్రీ నిర్భయానంద మాడెం రాజబాబు, వివేకానంద మాడెం లక్ష్మయ్య నిర్వికల్పరహిత గడ్డం సమ్మయ్య గార్ల ఆధ్వర్యములో జంగిల్ శంకరయ్య, గోగుల ఆదిరెడ్డి, తీగల మహబూబ్‌రెడ్డి, గూడెల్లి దేవేందర్, బండి మొగిలి, అప్పని బాలకృష్ణ, ఇప్పకాయల సదానందం గారలచే జరుగును. **ఉదయం 9గంటలకు నగర సంకీర్తన** శ్రీ పూర్ణానంద గుడిబోయిన బిక్షమయ్య గారు, శ్రీ మోతె రాజిరెడ్డి గారు, శ్రీ శాంతానంద వోల్సోజు సదానంద చారి గారు, శ్రీ సదానంద యెడ సారంగపాణి గార్ల ఆధ్వర్యములో పెద్దాపురం, కడిపికొండ, నందిగామ, పత్తిపాక, రేగొండ, అమ్మాపురం, మహాముత్తారం, తొగర్రాయి, భూపాలపల్లి, రంగయ్యపల్లి, గోదావరి ఖని, చౌళ్ళపెల్లి మరియు సకాలమునకు వచ్చిన గురుభక్తాదులచే జరుపబడును. **ఉదయం 10-30 ని.లకు జండా ఆవిష్కరణ** శ్రీ సదానందం దాసరి చంద్రమౌళి గారి ఆధ్వర్యములో శ్రీ నిత్యానంద బింగి రాజయ్య, హైద్రాబాద్ గారి కరకమలములచే జరుగును. ఉదయం 11గంటలకు శ్రీవారి మండలారాధన పూజ శ్రీ భక్తానంద ఆశ్రమ అధ్యక్షులు శ్రీమతి సుభద్ర సమేత సిరికొండ వెంకట్రాం నర్సయ్య గారి ఆధ్వర్యములో శ్రీమతి సుశీల సమేత సత్యానంద కూనమళ్ళ సదానందం దంపతులు, శ్రీమతి పిల్లలమర్రి నిర్మల, శ్రీ పూర్ణానంద పిల్లలమర్రి పూర్ణ దంపతులు, శ్రీ శివానంద శివ దంపతులు, శ్రీ రామానంద రాము దంపతులు, శ్రీమతి జ్ఞానేశ్వరి సమేత సిర్వం రమేష్ దంపతులు, శ్రీమతి పోతులూరి గీత, వజీర్ సుగుణ, పూజారి సమ్మక్క, నర్ర సుగుణక్క, గద్దం కమలేశ్వరీ, అంబరికొండ కవిత మరియు శ్రీవారి శిష్య భక్త బృందంచే జరుపబడును.

మధ్యాహ్నం 1గంటకు తీర్థప్రసాదములు-భోజనములు శ్రీ గుముడవెల్లి సోమయ్య-లక్ష్మీ దంపతులు, శ్రీ నెమలిపురి శ్రీనివాస్ దంపతులు, శ్రీ నిష్కల్మషానంద పోతరాజు చంద్రయ్య దంపతుల ఆధ్వర్యములో నిత్యానంద పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, శాంతానంద ముద్రబోయిన స్వామి, శ్రీ సత్యానంద జల్లెంకి సోమనర్సయాచారి, సామల మైనర్‌బాబు, బూర్గుల రామారావు, జంగిలి వెంకట్రాజం, కట్ల సంజీవరెడ్డి, పాలకుర్తి శ్రీనివాస్, కూరపాటి శ్రీనివాస్, పావురాల శ్రీను, పాలడుగు స్వామి, దుకిరే మోహన్‌రావు, రాపోలు వీరయ్య, ఉప్పుల్‌రెడ్డి, పాపయ్య, నరాల వెంకటరాజం, తిప్పని రాజమొగిలి, గోరంటల విక్రమ్, శృంగారపు ఓంకార్, చనుగోజు మొగిలి, శంకరయ్య, కూరెల్లి రామాచారి గారలచే జరుపబడును. **మధ్యాహ్నం 2-30 ని.లకు సంస్మరణ సభ :- సభాధ్యక్షులు :** సభాసామ్రాట్ అచలబోధవాచస్పతి శ్రీ వివేకానంద బండారు సుబ్బాయార్య స్వాములవారు, **సభా ఉపాధ్యక్షులు :** శ్రీ దయానంద నాగుల వెంకటేశం గారు, **గౌరవాధ్యక్షులు :** శ్రీ సమిష్టి బోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తి స్వామివారు, శ్రీ సుగుణాంబ కామందుల లక్ష్మీనారాయణమ్మ గారు, శ్రీ యదార్ధబోధోపదేశిక కూన దయానంద స్వామివారు, శ్రీ నిర్మలానంద నిల్లా కృష్ణమూర్తి గారు, శ్రీ నిర్మల నిజానంద రౌతు రామకృష్ణ స్వామి వారు, శ్రీ ప్రజ్ఞాన విలక్షణ యన్. సుబ్బాయార్యులవారు, శ్రీ నిత్యానంద బింగి రాజయ్య గారు, శ్రీ బాల్నుకు పరమేశ్వర్, శ్రీ కరుణానంద తుమ్మల ఉమామహేశ్వర రావు గారు, శ్రీ సమరసానంద బొద్దు క్రిష్ణమూర్తి గారు.

శ్రీ శాశ్వితానంద చెన్నదాసు గారు, శ్రీ పూర్ణానంద అంబటి పుల్లారెడ్డి గారు, జ్యోతి ప్రజ్వలన :- శ్రీ పోలం మాధవరెడ్డి గారు, సభాప్రారంభోప న్యాసకులు : శ్రీ యువసామ్రాట్ పూర్ణానంద గౌడుచెర్వు బ్రహ్మానంద రెడ్డి గారు, సభ గురుప్రార్థన : శ్రీమతి కొలిపాక నిర్మల, శ్రీమతి కంకటి కళ్యాణి, శ్రీమతి అన్నం విజయ, శ్రీమతి సంపతి రజిత.

ముఖ్య అతిథులు :- శ్రీ శాశ్వితానంద సామ్లేటి ఉప్పలయ్య స్వామివారు, శ్రీ శ్రద్ధానంద అడిగొప్పుల మల్లేశం గారు, నిర్భయానంద గుమ్మడి కూర్మయ్య గారు, గుణరూపరహితానంద బందారు హనుమంతప్ప గారు, శ్రీ సత్యానంద సామలేటి వెంకటయ్య గారు, శ్రీ సదానందం దాసరి చంద్రమౌళిగారు, శ్రీ నిత్య నిర్భయానంద స్వామి వారు, శ్రీ కృపానంద కోడం లక్ష్మీనారాయణ గారు, పూర్ణానంద పైడికొండ నాయన గారు, పూర్ణానంద ఉపన్యాసకేసరి నీలి వెంకరత్నం గారు, శ్రీ పూర్ణానంద బొడ్డు సత్యనారాయణ గారు, శ్రీ శ్రద్ధానంద రామగిరి క్రిష్ణయ్య గారు, శ్రీ నిర్భయానంద గిడ్ల సత్యదాసు భాగవతార్ గారు, శ్రీ సచ్చిదానంద మద్దుల వెంకట్‌రెడ్డి గారు, శ్రీ ప్రేమానంద బొప్ప రాములు గారు, శ్రీ వేదాతీత వెలిగేటి నారాయణ గారు, శ్రీ సమరసానంద కోట్ల నల్లయార్యుల వారు, శ్రీ సదానంద తిరువీదుల బాపనయ్య గారు, అచలానంద శ్రీనివాసులు రెడ్డిగారు, శ్రీ నిర్భయానంద జొన్నాద దుర్గారావు గారు. ప్రత్యేక ఆహ్వానితులు :- శ్రీ మొలుగూరి బిక్షపతి ఎం.ఎల్.ఏ. గారు, శ్రీ కారం యాదగిరి గారు, శ్రీ చిట్టిమల్ల వీరభద్రం గారు, శ్రీమతి రాయరాకుల యాదమ్మ గారు, శ్రీ కందగట్ల వేణుగారు, విశిష్ట అతిథులు :- శ్రీ కొంపెల్లి ధర్మారావు గారు, శ్రీ బీర్ల మనోహర్‌రెడ్డి గారు, శ్రీ రాయరాకుల రవీందర్ గారు, శ్రీ ఎన్కతల రవీందర్ గారు, కక్కెర్ల రాజుగౌడ్ గారు, గట్టు వేణుగౌడ్ గారు, సావూరి రాజేశ్వర్‌రావు గారు, నకినబోయిన సాంబయ్య గారు, శ్రీ కోడెపాక సుధాకర్‌రావుగారు, కృష్ణమూర్తి బాలాజీ సేటు గారు, వద్దిరాజు రవిచంద్ర గారు, శ్రీ కొంపల్లి అశోక్ గారు. సభా వేదిక ఆసీనులగు పెద్దలు :- శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు గారు, శ్రీ దయానంద శివార్చక వటపత్రశాయి గారు, శ్రీ నిర్భయానంద చందంపేట బస్వరాజుగారు, శ్రీ నిర్మలానంద వనమాల లింగమయ్య గారు, శ్రీ దయానంద సి.హెచ్. రాములు సోదర బృందం, శ్రీ నిత్యానంద కొపనాతి బాలక్రిష్ణ గారు, శ్రీ నిత్యానంద ఏనుగు రాంచంద్రారెడ్డి గారు, శ్రీ నిత్యానంద పెద్దోళ్ళ మాణిక్యరెడ్డి గారు, శ్రీ పూర్ణానంద చొక్కాపు లక్ష్మీనాయుడు గారు, శ్రీ నిర్మలానంద శెగ్గారి విఠల్‌గౌడ్ గారు, శ్రీ వింజమూరి విఠలయ్య గారు, జొన్నాద కేశవులు గారు, శ్రీ రామానంద రుద్రారం రామగౌడు గారు, శ్రీ రామానంద రామాచారి గారు, శ్రీ శాశ్వితానంద గుర్రం రాములు గారు, శ్రీ సచ్చిదానంద రామగిరి గోపాల్ గారు, శ్రీ జక్లేరు నరేష్ గారు, శ్రీ పరమానంద పాళెం చెన్నారెడ్డి గారు, శ్రీ బోధానంద వాడికారి మోహన్‌రావు గారు, శ్రీ అచలానంద నీలం తిరుపతయ్య గారు, శ్రీ శ్రద్ధానంద చెలిమెల రాజిరెడ్డి గారు, శ్రీ అమలగురుచరణ సేవాహంసి నాగుల లక్ష్మీ గారు, శ్రీ నిర్మలాంబ పెండెం పద్మావతమ్మ గారు, శ్రీ గురుకరుణాంబ చెన్న కమలమ్మ గారు, శ్రీ గురుప్రియాంబ పాళెం మహేశ్వరమ్మ గారు, శ్రీ నిర్మలానంద గ్రరె రాంమూర్తి గారు, శ్రీ నిశ్చలానంద గుంటు క్రిష్ణారావు గారు, శ్రీ పూర్ణానంద యాంద్ర వెంకటేశ్వరరావు గారు, శ్రీ మంత గురుమూర్తి గారు, శ్రీ నిర్గుణానంద బంగారు వీరన్న గారు, శ్రీ విదేహానంద ఆరుగొండ విశ్వనాథం గారు, శ్రీ ప్రేమానంద లేవాకు వెంకటసుబ్బారెడ్డి గారు, శ్రీ పూర్ణానంద నారాయణరెడ్డి గారు, శ్రీ అచలఋషి ఆనందయ్య గారు, శ్రీ సహజానంద రవీందర్‌రెడ్డి గారు, శ్రీ సుధామృతాంబ వసంతవనజాక్షమ్మ గారు, శ్రీ సులక్షణాంబ డా॥ కె. జయలక్ష్మమ్మ గారు, శ్రీ విమలాంబ కాళేశ్వరమ్మ గారు, శ్రీ కస్తూరి పోచమాంబ గారు, శ్రీ డా॥ అరుణమ్మ గారు, శ్రీ అచలానంద అల్లు అప్పారావు గారు, శ్రీ సేవానంద రాపోలు బ్రహ్మానందచారి గారు, శ్రీ బోధానంద బొడ్డు అంబరీష్ గారు, శ్రీ నిరంజనానంద రామకృష్ణ గారు, శ్రీ నిమిష్కళంక నీలావు చిన్నయ్య మాస్టరు గారు, శ్రీ వివేకానంద ఆర్మూరు విజయకుమార్ గారు, శ్రీ పూర్ణబోధాచార్య సుబ్బాచార్యులు గారు, శ్రీ పూర్ణబోధాచార్య పాండురంగము గారు, శ్రీ కరుణానంద మోస రామరావు గారు, శ్రీ శాంతానంద అలువాల కృష్ణమూర్తి గారు, శ్రీ బోదానంద సుదర్శన్ గౌడు గారు, శ్రీ శాంతానంద శంకర్‌లింగం గారు, శ్రీ గురుకరుణానంద శీలం కాళిదాసు గారు, శ్రీ విమలానంద సదానందం గారు, శ్రీ బ్రహ్మానంద బొమ్మెర మురళి గారు, శ్రీ నిర్మలానంద గోశిక అంజయ్య గారు, శ్రీ పరమానంద సామ వెంకన్న గారు, శ్రీ పూర్ణానంద విఠల్‌రెడ్డి గారు, శ్రీ సదానంద కొప్పిశెట్టి జగపతిరావు గారు, శ్రీ సమరసానంద తిరుపతయ్య గారు, శ్రీ సదానంద బానాల సాంబయ్య గారు, శ్రీ సంకల్పరహిత ఉప్పల వెంకటరాజం గారు

శ్రీ నిర్భయానంద బండ్యాల బసవారెడ్డి గారు, శ్రీ దయానంద రాపెల్లి రాజమల్లయ్య గారు, శ్రీ బోధానంద వనపర్తి బిక్షపతి గారు, శ్రీ సహజానంద లక్కి కొండయ్య గారు, శ్రీ శ్రద్ధానంద బండి నాగయ్య గారు, శ్రీ పూర్ణానంద పుట్ట బాలయ్య గారు, శ్రీ బురుజుకింద లింగం గారు, శ్రీ పూర్ణానంద గుడిబోయిన బిక్షం గారు, శ్రీ విమలానంద వెన్ను నాగయ్య గారు, శ్రీ యాదం రమణ గారు, శ్రీ కొలిపాక మదనయ్య గారు, శ్రీ కర్నెకంటి కృష్ణారెడ్డి గారు, శ్రీ పూజారి మనోహర్ గారు.

విషయ నిర్ణయ సభ తేది : 23-09-2013 సోమవారం సా॥ 5గం॥ల నుండి

సభాధ్యక్షులు :- శ్రీ భూమానంద గుత్తికొండ దామోదర్‌రెడ్డి గారు, ఉపాధ్యక్షులు :- శ్రీ పూర్ణానంద బొడ్డు సత్యనారాయణ గారు, శ్రీ సమరసానంద తిరుపతయ్య గారు, గౌరవాధ్యక్షులు :- శ్రీ సమరసానంద మోతె కృష్ణయ్య గారు, శ్రీ శివార్చక వటపత్రసాయి గారు, శ్రీ దయానంద చిప్ప మహావిష్ణు గారు, శ్రీ పూర్ణానంద బైరెడ్డి గోపాల్‌రెడ్డి గారు, శ్రీ నిత్యానంద బండ్యాల రాంరెడ్డి గారు, శ్రీ విమల విజ్ఞాన జంబోజు లింగమూర్తి గారు, శ్రీ ప్రేమానంద బైరిలింగం గారు, శ్రీ పూర్ణానంద బొల్లి సత్యనారాయణ గారు, శ్రీ శ్రద్ధానంద చేర్యాల బలరాం గారు.

శ్రీ భూమానంద బూర్గుల బాబురావు దంపతులు, శ్రీ సమరసానంద పోరెడ్డి రమణారెడ్డి దంపతుల ఆధ్వర్యములో శ్రీవారి శిష్యప్రశిష్యులచే విచ్చేసిన పెద్దలందరికి సన్మానము చేయబడును.

ఆశ్రమ పీఠ పుష్పాలంకరణ : వొల్లాజి రాజేందర్, పెర్గు లింగమూర్తి, గన్‌రెడ్డి రవీందర్‌రెడ్డి, మాందాటి రాజు, కూరపాటి శ్రీనివాస్, అప్పని సత్యనారాయణ, మోరె రాజేశ్వరరావు, కొండూరి దశరథం, గిరుక శాయిరెడ్డి, కుంటమల్ల సమ్మయ్య, పోరెడ్డి శాయిరెడ్డి, గురిజాల రవి, తాటి రమేష్, నాగులగాని సాంబశివరావు.

కోలాట ప్రదర్శన : పెద్దాపురం గ్రామ యాదవ సంఘం వారిచే జడకొప్పు కోలాట ప్రదర్శన చేయబడును.

సమయానుకూలముగా భజన కాలక్షేపము ఈ దిగువ తెలిపిన వారిచే జరుపబడును. :- కడివెండి నర్సింహ్మారాములు గారు, గూటం లింగారెడ్డి గారు, బండి శేకరయ్య, గుండు చేరాలు, కొంగర లక్ష్మణ్, బండి ఎల్లయ్య గార్ల ఆధర్వ్యంలో జరుగును.

గురుదక్షణలు :- నిర్మలానంద భీమయార్యుల శిష్య ప్రశిష్యులు మరియు దాతలు గురుపూజకు ముందుగా దక్షణలు సమర్పించుకున్న వారి పేర్లను ఫ్లెక్సీ బ్యానర్లు ముద్రించి గురుపూజా కార్యక్రమములో ఉంచుదురు.

గమనిక :- గురుపూజకు విచ్చేసిన పీఠాధికారులు, బోధాధికారులు మరియు భక్తులు వారి వారి నామములు, గ్రామము, మండలములు, జిల్లా గురుపరంపర గురువుల పేర్లు, ఫోన్ నెంబర్లు తప్పనిసరిగా కాగితము పై వ్రాసి ఆశ్రమములో ఉన్న కమిటి సభ్యులకు అందించగలరని ప్రార్థన.

భజన పోటీలు :- తేది : 23-09-2013 సోమవారం సాయంత్రం 9గం॥ల నుండి తెల్లవార్లు జరుపబడును.

టెంట్ హౌజ్ సహకారం :- కక్కెర్ల రాజు, పెద్దాపురం, కీ.శే. కక్కెర్ల రాంచందర్ గౌడ్ జ్ఞాపకార్థం వారి కుమారుడు సుదర్శన్ గౌడ్ పెద్దాపురం.

ఎలక్ట్రికల్ సహకారం :- కందకట్ల రాంచందర్ గారు, పరకాల, వీడియో సహకారం :- పిల్లలమర్రి శివ, రాము-పాలంపేట.

మహా మంగళహారతి :- తెల్లవారుజామున 5గం॥లకు శ్రీమతి గురుకరుణానంద గీద లక్ష్మీ, బూర్గుల నిర్మల, బండి రామలక్ష్మీ, కూన పుష్ప, పోరెడ్డి అమృత, కూనమళ్ల సుశీల, గుంత సరస్వతి, లోకాటియాదమ్మ సర్వం జ్ఞానేశ్వరి, మాదెం మంజుల, వోల్వోజు నళిని, భూతాల ఉమ, మొంద్రాతి శారదాంబ, గ్యారంపల్లి లలిత, పెర్గు శ్రీలత, దుకిరె రత్నాబాయి, మాసంపెల్లి దేవేంద్ర, మోరె యాదమ్మ, పాలకుర్తి శ్రీలత గార్లచే జరుపబడును.

కార్యక్రమ నిర్వాహకులు-పెద్దాపురం : శ్రీ అన్నం కుమారస్వామి, శ్రీ కక్కెర్ల చంద్రమౌళి, జిల్లపల్లి వీరమల్లు, భూతాల తమాషారావు, సిద్దోజు రమేష్, యాదన్న ఎల్లయ్య, సిద్దోజు లక్ష్మణాచారి, కొంపల్లి నర్సింహ్మాస్వామి, భూతాల శివ, కక్కెర్ల కొమురయ్య, శ్రీ ముంద్రాతి భద్రయ్య, శ్రీ మహేశ్వరపు రాజయ్య, దొమ్మాటి నర్సింగ్‌రావు, గువ్వాటి సాంబయ్య, సుఖినె తాండురావు.

సమయానుకూలముగా కార్యక్రమములు మార్చబడును.

బస్సు రూట్ :- వరంగల్ నుండి పెద్దాపురం వచ్చుటకు కాశిబుగ్గ సిద్దయ్య హోటల్ నుండి బస్సులు, జీపులు, ఆటోలు కలవు. పరకాల, ములుగు నుండి వచ్చువారు ఆత్మకూర్ మండలం నుండి బస్సులు ఆటోలు సౌకర్యం కలదు.

ఇట్లు : ఆహ్వానించువారు.. శ్రీవారి శిష్య ప్రశిష్య బృందం
గ్రా॥ పెద్దాపురం, మం॥ ఆత్మకూరు, జి॥ వరంగల్.
సెల్ : 9951231943, 9849605303,
9704442307, 9949200109


శ్రీ నిత్యానంద పిల్లలమర్రి వెంకటేశ్వర్లు దంపతులు
మహాముత్తారం


శ్రీ నిర్వికల్పరహిత గద్దం సమ్మయ్య-అనసూయ
మహాముత్తారం


శ్రీ ఉ.ప. గుడిమల్ల సమ్మయ్య-లక్ష్మీ
గోపాలపురం హన్మకొండ


శ్రీ కక్కెర్ల సాంబయ్య-సుబద్ర
పెద్దాపురం


శ్రీ కక్కెర్ల కుమారస్వామి-రేణుక
పెద్దాపురం


శ్రీ కక్కెర్ల రాజు-రమ
పెద్దాపురం


శ్రీ కక్కెర్ల రాజు కక్కెర్ల కమలహాసన్
టెంటు హౌస్ సహకారం పెద్దాపురం


శ్రీ ఉ.ప. కూనమల్ల సాంబయ్య
పెద్దాపురం


శ్రీ ఉ.ప.శ్యామల మైనర్ బాబు-సూజాత
నందిగామ


శ్రీ లి.ప .గ్యారంపెల్లి నర్సింగరావు - అమృతబాయి
లింగమడుగుపల్లి


శ్రీ లి.ప. బోరగాని బాలయ్య-అమృతమ్మ
లింగమడుగుపల్లి


శ్రీమతి&శ్రీ కొంపెల్లి స్వరూప-రాజేందర్
పెద్దాపురం


శ్రీమతి&శ్రీ బొల్లోజు రాజకుమారి-కుమారస్వామి
పెద్దాపురం


శ్రీ లి.ప. చికటి యశోద
పెద్దాపురం


శ్రీమతి నట్ల మంజుల
పంతిని


శ్రీ లి.ప.లప్పని సత్యనారయణ-స్వరూప
గోదవరిఖని


శ్రీ లి.ప.పంజాల పాపయ్య-పుష్పమ్మ
అమ్మపురం


శ్రీ లి.ప.గోరంటాల విక్రమ్-భవాని
భూపాల్‌పల్లి


శ్రీ లి.ప.నెమళిపురి శ్రీనివాస్ - మమత
శ్రీనగర్


శ్రీ లి.ప.జెల్ల అశోక్ బాబు-సునిత
కొగిలవాయి


శ్రీ లి.ప.లంకేశ్వరపు నర్సింగం-కోమల
పులుకుర్తి


శ్రీ లి.ప.అన్నం కుమారస్వామి-సరోజన
పెద్దాపురం


శ్రీ నిర్మలానంద వనమాల లింగమయ్య -విజయలక్ష్మి
హైద్రాబాద్


శ్రీ సత్యానంద సొప్పేటి వెంకటయ్య గారు
బీమండి


మొండ్రబోయిన రాములు
మహ్మదాపురం


పిల్లలమర్రి సమ్మయ్య మణెమ్మ
పాలంపేట


పిల్లలమర్రి మొగిలయ్య సుశీల
పాలంపేట


పిల్లలమర్రి బద్రయ్య బలదాంబ
పాలంపేట


గోరికాలి రాజలింగయ్య దంపతులు
గోదావరి ఖని


బంగిలి లింగమూర్తి ఉదయ
నందిగామ


గూడెల్లి మల్లయ్య ఎల్లమ్మ
జాలైవాడ


బొడ్డుపెల్లి సాయిలు సోమనర్సమ్మ
జాలైవాడ


బండి మొగిలి లక్ష్మి
రంగయ్యపల్లి


దేశిని రాజయ్య పద్మ
రంగయ్యపల్లి


బండి శేకరయ్య
రంగయ్యపల్లి


గిరుక సాయిరెడ్డి సముద్ర
మహబూబునగర్


శృంగారపు మొగిలి సరోజన
వెంకటాపురం


సముగోజు శంకరయ్య వనమాల
వెంకటాపురం


తుమ్మల ఉప్పల్ రెడ్డి ఎల్లమ్మ
అమ్మాపురం


దొనక కుమార్ కేతమ్మ
అమ్మాపురం


గూడెల్లి దుర్గయ్య అలివేలు
అమ్మాపురం


శనిగరపు మల్లక్క తిరుపతి
జాబ్లినగర్


బిల్ల సరోజన మల్లయ్య
జాబ్లినగర్


బక్కుల ఎల్లయ్య రాజక్క
జాబ్లినగర్


పొన్నం మల్లయ్య-సరోజన
మమ్మాదాపురం


నల్లతీగల యాకయ్య- రుక్మిణి
హన్మకొండ


మురారి మల్లయ్య-వరలక్ష్మీ
నర్సంపేట


ముద్రబోయిన సమ్మయ్య-సాంబలక్ష్మీ
మమ్మాదాపురం


కోటగిరి వేంకటరాంనర్సయ్య-సరేంద్ర
అమ్మాపురం


కుంటమల్ల సమ్మయ్య
రేలకుంట


అడెపు సారంగం- సరోజన
మమ్మాదాపురం


మురహరి కుమారస్వామి - లలిత
మమ్మాదాపురం


అనపర్తి శ్రీను -కళమ్మ
అమ్మాపురం


పంజాల సోమయ్య-అంజార
అమ్మాపురం


గూడెల్లి అంజయ్య-జ్ఞానేశ్వరి
హన్మకొండ


ఊటి రమేష్ దంపతులు
మహాముత్తారం


పోతరాజు రాములు-కనుకవ్వ
గోదావరిఖని


మాదెం సమ్మయ్య-లక్ష్మీ
మహాముత్తారం


గోగు మల్లయ్య -రాజమ్మ
అంకుశాపురం


కిరుగంటి రమేష్-కళావతి
హన్మకొండ


పాగె బానయ్య-అనసూయ
మహాముత్తారం


నర్ర సుగుణ పందికుంట


లెంకల ప్రభాకర్ రెడ్డి-వనమాల
గోదావరిఖని


సులువ రాజనర్సు-ఈశ్వరమ్మ
గోదావరిఖని


ఆదెపు శ్రీను-సంధ్యారాణి
మచ్చాదాపురం


గద్దె చందరరావు-ఉమ
మచ్చాదాపురం


గద్దె గోపాల్-రమ
మచ్చాదాపురం


బలబక్కుల కోటి-జయ
మచ్చాదాపురం


పాలడుగుల నారాయణ-లక్ష్మీ
మచ్చాదాపురం


ఆదెపు బిక్షపతి-రమ
మచ్చాదాపురం


బలబక్కుల రణధీర్ అమ్మ చెల్లె
మచ్చాదాపురం


బలబక్కుల సుశీల
మచ్చాదాపురం


బుర్ర కొమురయ్య-భారతి
కడిపికొండ


ఇంజిరాల ప్రభాకర్ - మల్లికాంబ
కడిపికొండ


వర్కేటి సుధాకర్ - స్వరూప
కడిపికొండ


వర్కేటి వెంకటరమణ- సరిత
కడిపికొండ


వర్కేటి వేణుగోపాల్- సవీనలక్ష్మీ
కడిపికొండ


బుర్ర శ్రీనివాస్-సరిత
కడిపికొండ


కూరపాటి శ్రీనివాస్-లావణ్య
కాజీపేట


నాగపురి రాజయ్య-వెంకటలక్ష్మీ
కడిపికొండ


బండి ఎల్లయ్య-రాజేశ్వరి
కడిపికొండ


రాపాల లింగయ్య-కనుకవ్వ
గోదావరిఖని


కడివెండి నరసింహరామయ్య-విజయ
పత్తిపాక


వైద్యుల రాంరెడ్డి-సరోజన
పత్తిపాక


రావుల నారాయణ రెడ్డి-సమ్మక్క
పత్తిపాక


కొంగర లక్ష్మీనారాయణ-లక్ష్మి
పత్తిపాక


ఒల్లాల రాజేందర్ -నిర్మల
పరకాల


గురిజాల రవీందర్-లలిత
మల్లక్కపేట,పరకాల


నాలికె కొమ్మాలు-కొమురమ్మ
పత్తిపాక


మాందాడి రాజు-సమ్మక్క
పత్తిపాక


ధూమాల రాజేశ్వరరావు-నిర్మల
మల్లక్కపేట, పరకాల


లాండె రాజేశ్వరరావు - హేమ
పరకాల


గూటం లింగారెడ్డి-రాజక్క
రేగొండ


పాండుగుల స్వామి-సరోజన
మహ్మదాపురం


ఆదేపురాజేందర్ - ఈశ్వర
మహ్మదాపురం


గద్దె రాజేశ్వరరావు-సునిత
మహ్మదాపురం


బొరిగె పాణి-సుజాత
మహ్మదాపురం


పెదిసెల్ల కళావతి
మహ్మదాపురం


కొల్లూరి శంకర్ రావు-రమ
నందిగామ


గండు చేరాలు-రాజక్క
నందిగామ


గండు ఐలుకొమురయ్య
నందిగామ


రాపోలు వీరయ్య-శోభ
చిట్యాల


అనపురం మహేందర్-లత
చిట్యాల


దొనెక యాకయ్య-యాకలక్ష్మి
అమ్మాపురం

